# ఉభయకుశలోపరి

[పల్లెటూరి జీవితం]

గోపీచంద్

రేడియో ప్రసంగాలు



# ఇతరరచనలు



పట్టాభిగారి సోషలిజం

(రాజకీయం)



ఆడమళయాళం

(కథలు)



భార్యల్లో నేవుంది

(కథలు)



దేశం ఏమయ్యేటట్టు?

(కథలు)



ఆకాశవాణి [illegible] కేంద్రం

T. V. Hanumantha Rao

Gudivada

— . . —

శ్రీ,

లావు అంకెమ్మగారికి.

ఈ రోజుల్లో

గంగానదిలో

స్నానం చేసే

ధైర్యం పుణ్యం చుకు

— గోపీచంద్

— .. —

# ఉభయకుశలోపరి

[ రేడియో ప్రసంగాలు ]



గోపీచంద్

# చిత్తగించవలెను

నేను పల్లెటూరి జీవితాన్నిగురించి అప్పుడప్పుడూ చేసిన రేడియోప్రసంగాలివి. ఈ ప్రసంగాలు విన్నవాళ్ళూ, పేపర్లలో చదివినవాళ్ళూ ప్రోత్సాహంచెయ్యటంవల్ల, ఇప్పుడు పుస్తకంగా వేయిస్తున్నాను.

నా చిన్నతనం ఎక్కువగా అంగలూరూ, చౌటపల్లీ, రామాపురం గ్రామాల్లో గడిపినవాణ్ని అవటంవల్ల ఈ ప్రసంగాల్లో ఎక్కువ సంగతులు ఆ గ్రామాలకు సంబంధించినవే అయివుంటై — కాని ఆ గ్రామాలకు మాత్రమే చెందవలసిన ప్రత్యేకత ఏమీ లేదు. సామాన్యంగా అన్నిగ్రామాల్లోనూ ఉండేలక్షణాలే రాశాను.

## "రైతు! రైతు!!"

మనదేశంలో ఎక్కువ ప్రజలు గ్రామాల్లో జీవించేవాళ్లే అవటంవల్ల, దేశం బాగుపడాలంటే గ్రామజీవితం బాగు చెయ్యటం ముఖ్యావసరం. పెద్దపెద్ద నాయకులు కూడా ఈ విషయం గ్రహించి వారికితోచిన సలహాలను ఉపన్యాసాల ద్వారా, వ్యాసాలద్వారా ప్రచారం చేస్తున్నారు. ఎక్కడ విన్నా 'రైతు' అనేమాటే వినబడుతూవుంది. ప్రతిపార్టీ, ప్రతి నాయకుడూ రైతుని తనపక్కకు తిప్పుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రతివాడూ, "అయ్యో, మూగరైతా!" అని విచారపడుతున్నాడు. ఈ పరిస్థితి కొంతమంది స్వార్థపరులకూకూడా తావిచ్చింది. రైతుకి మాయమాటలు చెప్పి, తియ్యని మాటలతో అతన్ని మోసంచేసి తమ స్వార్థానికి ఉపయోగించుకోటానికి కొంతమంది ప్రయత్నిస్తున్నారు. కొంతమంది సదు

ద్దేశంతోనే రైతుకు సహాయంచెయ్యటానికి సంకల్పించుకొని ఏంచెయ్యాలో తోచక తాము తికమకపడి, రైతుని తికమక పెట్టి నష్టపరుస్తున్నారు. మొత్తానికి ఏదెట్లావున్నా, రైతు సహాయం చెయ్యతగ్గవాడనీ, రైతుకి సహాయం చెయ్యాలనీ మాత్రం అంతా వొప్పుకుంటున్నారు.

## అన్నీ అబద్ధాలే!

మానవసంఘంలో అనాదినుంచీ కొంతమంది ప్రజానీకం మీద ఏదోఒక విధంగా పెత్తనంచెయ్యటం జరుగుతూనేవుంది. ఒకప్పుడు భుజబలం గలవాళ్లు చేస్తేయేమి? ఒకప్పుడు లౌకిక జ్ఞానం కలవాళ్లు చేస్తేయేమి? ఒకప్పుడు ప్రవక్తలు చేస్తేయేమి? ఒకప్పుడు శాస్త్రజ్ఞానం కలవాళ్లు చేస్తేయేమి? ఎప్పుడూ ఏకొద్దిమందో ప్రజానీకాన్ని తమ చెప్పుచేతల్లో ఉంచుకొని తమకోసం వాడుకుంటూనే వున్నారు. కొద్దిమంది ఎక్కువ మందిని లోబరచుకోవాల్సి వచ్చేటప్పటికి, అనేక అబద్ధాలు సబద్ధాలుగా, నీతులుగా, ధర్మాలుగా ప్రచారంచేసి, ప్రజానీకాన్ని మోసంచెయ్యాల్సి వచ్చింది—చేశారు. ఈ విధంగా మానవజాతి చరిత్ర అంతా అబద్ధాల మయమే అయిపోయింది.

మానవ సౌభ్రాతృత్వం అనే అబద్ధం
దేవుడనే అబద్ధం
కర్మ అనే అబద్ధం
స్వర్గం అనే అబద్ధం
నరకం అనే అబద్ధం
పుణ్యం అనే అబద్ధం
పాపం అనే అబద్ధం

అన్నీ అబద్ధాలే! ఈ అబద్ధాలన్నీకూడా ప్రజానీకాన్ని బానిసత్వంలో వుంచి తమ స్వార్థానికి ఉపయోగించు కోటాని గ్గాను స్వార్థపరులు సృష్టించి, ప్రచారంచేసి నమ్మించారు.

## మానవ సౌభ్రాతృత్వం

ఇదొక పెద్ద అబద్ధం. అంటే మానవులంతా సోదరులుగా ఉంటం తప్పనికాదు—ఉండగూడదనీ కాదు. ఈ పరిస్థితుల్లో ఇది జరగటానికి వీలుందా? ఈ నినాదం లేవనెత్తిన ఉద్దేశం ఏమిటి? ఫలితం ఎట్లావుంటుంది?

ఇప్పుడు ప్రపంచంలో పీడించేవాళ్లూ పీడింపించుకునేవాళ్లూ వున్నారు. పీడించేవర్గం ఏనాడో ఆస్తులు సంపాదించుకొని అట్టి పెట్టుకుంది. మిగిలినజనం ఈ పైవర్గానికి దాస్యంచేసి బతుకుతూ వుంది. ఇప్పుడు మానవ సౌభ్రాతృత్వం ఎక్కడికి దారి తీస్తుంది? ఆస్తులున్నవాళ్లు ఆస్తుల్లేనివాళ్లకి తమ ఆస్తుల్ని పంచిపెడతారా? పెట్టరు. ఊరికే బీదవాళ్లని ప్రేమగా సోదరంగా చూస్తారు. బీదవాళ్ళు కూడా పైవర్గాన్ని అలాగే చూడాలి. అంటే వాళ్లని విపరీతమైన కోర్కెలు కోరగూడదు. వాళ్ల ఆస్తుల్ని పంచమన గూడదు. "కష్టంచేసేది మేము—దాని ఫలితంఅంతా మాకే రావాలి," అనగూడదు. అంటే మానవ సౌభ్రాతృత్వానికి భంగం కలిగిందన్నమాట!

ఈ సిద్ధాంతం చివరికి ఇలా తేలుతుంది. పీడించేవాళ్ళ ఆస్తులు పీడించేవాళ్ళకే ఉండి, పీడించే అధికారంకూడా పీడించే వాళ్లకే వుండాలి. వీళ్ళుమాత్రం పీడింపించుకునేవాళ్ళని సోదర భావంతో చూస్తూవుండాలి. పావలా ఇవ్వవలసినచోట అయి దణాలిచ్చినా పరవాలేదు. కాస్త భూతదయచూపించినా పరవా

లేదు. ఇందుగ్గాను, పీడింపించుకునే వర్గంవారు ఆస్తులజోలికి వెళ్ళకుండా, వీళ్ళతో సమానహక్కులకోసం ప్రయత్నించకుండా, ఊడిగం చేస్తూ ఉండాలి.

అసలు ఆస్తులు పీడించేవాళ్ల కెందుకుండాలి? వాళ్ళ మీద అధికారం వీళ్ళ కెందుకుండాలి? వాళ్ళివ్వటం ఎందుకు? వీళ్లు పుచ్చుకోవటం ఎందుకు? ఇంకా కొన్నాళ్ళు అధికారంలో ఉంటానికే ఈ అబద్ధం ప్రచారంలోకి తేబడ్డది. వింటానికి చక్కగా ఉంటుంది—క్రియలో ప్రజానీకానికే హాని చేస్తుంది. ప్రజానీకంమాత్రం మోసపోయి, "దొర నిగర్వి-చాలా దయగా చూస్తాడు," అని వొళ్లువిరుచుకొని అంతా మీదేసుకొని పని చేసిపెడుతుంది. అసలు సంగతే మరచిపోతుంది.

"దొంగతనం చెయ్యకు"

"దొంగతనం చెయ్యకు" అనే నీతి ఇప్పుడు ఆబాలగోపాలానికీ తెలుసు. ధనవంతుడు మొదలుకొని బీదవాడివరకూ దొంగతనం చెయ్యటాన్ని అవినీతిగానే ఎంచుతాడు. పుట్టు బీదల్లో కూడా ఈ ధర్మం చెలామణీ అవుతూనేవుంది—వీలైనంతవరకు అడుక్కు-తింటానికి ప్రయత్నిస్తాడుగాని దొంగతనం చెయ్యటానికి వొప్పుకోడు.

కాని మన సంఘంలో దొంగతనం చెయ్యంది ఎవ్వరు? కొన్ని దొంగతనాలు దొరతనంగా 'సంఘం' అంగీకరించి గజదొంగల్ని కాపాడుతూవుంది. కూలివాడు తన శరీరకష్టంతో పండిస్తే దాన్ని మరొకరు అనుభవించటం దొంగతనం కాదు! ఎందుకంటే 'సంఘం' అది దొరతనంఅని చెప్పింది. పదిరూపాయిలు అప్పిచ్చి వడ్డీవంకతో ఇరవైరూపాయిలు పుచ్చుకోవటం

దొంగతనంకాదు! ఎందుకంటే 'సంఘం' ఇది దొరతనంఅని చెప్పింది. అంటే ఈ దొంగతనాలన్నీ దొరతనాలు ఎందుకయిన య్యాంటే—వీటివల్ల లాభాలు అనుభవించే కొద్దిమందీ సంఘంగా తయారై ప్రజానీకాన్ని మోసంచేసి తమ్ముతాము రక్షించు కుంటున్నారు.

"అబద్ధం ఆడకు"

'అబద్ధాలు ఆడవద్దు' అనే ధర్మంకూడా ఇటువంటిదే. పెత్తనం చేసే కొద్దిమందీ, దొంగతనాలు చేసీ, అబద్ధాలాడీ ఎప్పుడో తమకు కావలసిన ఆస్తులను సంపాదించుకున్నారు. ఇక ఇప్పుడు సంపాదనకోసం దొంగతనం చెయ్యవలసిన అవ సరంగానీ, అబద్ధాలాడవలసిన అవసరంగానీ వాళ్ళకు లేదు. ప్రస్తుతం వాళ్ళుచేసే పనులన్నీ తాము సంపాదించుకున్న ఆస్తులు నిలబెట్టుకోటానికే! ఇందుకు వాళ్లు అబద్ధాలాడు తూనే వుంటారు —దొంగతనం చేస్తూనే వుంటారు. కాని ఈ అబద్ధాలను సత్యాలుగా ప్రజల్లో ప్రచారం చేస్తుంటారు. మనకు చెప్పే చదువుదగ్గరనుంచీ ఇందుకే వినియోగిస్తారు.

వీళ్ళు ఇంత జాగ్రత్త ఎందుకు తీసుకున్నారంటే, వాళ్ళకు మల్లే ప్రజలుకూడా అబద్ధాలాట్టం మొదలుపెడితే వాళ్ళ ఆస్తులు ఒక్క రోజుకూడా నిలవ్వు; వాళ్లు అనుభవిస్తున్న ప్రత్యేకహక్కులు నిలవ్వు. ఇన్నాళ్లనించీ వాళ్ళబద్ధాలాడి తమ్ము మోసంచేస్తున్నారని తెలుసుకొన్న మరుక్షణం ఇకేముంది?

"పెద్దమనిషి"

వీళ్ళు మరొక పన్నాగం పన్నుతారు. తాముచెప్పే అబద్ధా లన్నీ నమ్మి, తమ నాగరికతకు దాసుడైనవాణ్ణి "పెద్దమనిషి"

అని చెప్పి ప్రజలకు పూజ్యభావం ఏర్పడేట్టు చేస్తారు ఇతని వల్ల తమకు నిరపాయంగనకా, ఇలాంటివాళ్ళే తమకు కావల సింది గనకా, ఈ అబద్ధంతో ప్రజల్ని మోసంచేసి ప్రతివాడికీ పెద్దమనిషి అవ్వాలనే కుతూహలం కలిగేటట్లు చేస్తారు.

ఈ మధ్య నాస్నేహితుడొకడు, "అతడు చాలా మంచివాడు; ఏ విషయంలోనూ జోక్యం కలిగించుకోడు," అని ఒకర్నిగూర్చి చెప్పాడు. నాకు ఆశ్చర్యంవేసింది. ఎందుకనంటే ఏ విషయం లోనూ జోక్యం కలిగించుకోకపోవటం అంటే ఏమిటి? ఆ కొద్ది మందీ చెప్పే అబద్ధాలకూ, చేసే దొంగతనాలకూ, వాళ్ళ మొత్తం నాగరికతకూ దాసుడయ్యాడన్నమాటేగా? తాను ఏజోక్యం కలిగించుకోకుండా వీటన్నిటికీ పరోక్షంగా సహాయం చేస్తున్నాడన్నమాటేగా! ఈ "పెద్దమనిషి" కంటే ప్రజానీకా నికి ద్రోహంచేసేవాడు ఇంకెవ్వడుంటాడు? సంఘంలో పెద్ద మనుష్యులున్నారు, జాగర్త !!!

## దేముడు—కర్మ

తాము దొంగిలించిన హక్కులను కాపాడుకోటానికి ఈ స్వార్థపరులు మరొకపని చేస్తారు. తమకు అపకారంచేసే సిద్ధాం తాలనూ, పనులనూ, "ఇవి నీతిబాహ్యం—ఇలాచేస్తే ఒకవేళ ప్రభుత్వంకంట పడకపోయినా, దేముడు నిన్ను శిక్షిస్తాడు. దేముడు సర్వాంతర్యామి — అతన్నుంచి నువ్వు తప్పించుకో లేవు," అని భయపెడతారు. "అయితే దేముడనేవాడొక డుంటే, సన్మార్గులు ఈ లోకంలో కష్టపట్టం, దుర్మార్గులు సుఖ పట్టం ఎలాజరుగుతూవుంది?" అని ఏ 'అవినీతిపరుడ'న్నా ప్రశ్నిస్తే స్వర్గం నరకం చూపెడతారు. "ఇక్కడ మీరు కష్టా

లనుభవించినా, స్వర్గంలో సుఖిస్తారు. మేమిక్కడ సుఖాలనుభ వించినా, నరకంలో యాతనపడతాం. ఈ సుఖాలన్నీ బుద్బుద ప్రాయాలు—శాశ్వతమైనవి అవి. మేం భ్రష్టులంగనక మృగ తృష్ణవెంట పడుతున్నాం," అని చెప్పి మోసంచేస్తారు.

లేకపోతే వీళ్లనుభవిస్తున్న ప్రత్యేకహక్కులే నిలవ్వు! వీళ్ళు దొంగిలించిన ఆస్తులే నిలవ్వు! వీళ్లు సుఖపట్టానికే వీళ్లేదు!

**గొప్పతనం!**

ఈ విధంగా నడుస్తూవుంది ప్రపంచం. ప్రజానీకం ఈ అబద్ధా లన్నీనమ్మి పశుదశలోవుండి తమ విరోధులకే ఊడిగంచేస్తూ బతుకుతూవుంది. తమని బానిసత్వంలో వుంచిన సంస్కారాన్నే అనుకరించటానికి ప్రయత్నిస్తూవుంది. పైగా తమను మోసం చేసేవాళ్ళే వీళ్ళకు నాయకులు—వాళ్ళే వీళ్ళ శ్రేయోభిలా షులు—వీళ్ళ భవిష్యత్తుని నిర్ణయించిపెట్టేది కూడా వాళ్లే!!

అప్పుడు ప్రజల్లో పాతుకొనివున్న భావాలకు ఎవరైతే అను కూలంగా మాట్లాడుతారో వాళ్ళనే ప్రజలు గొప్పవాణ్ణిగా చేస్తారు. అందుకని ఈ పరిస్థితుల్లో ప్రజల్లోవున్న బానిసభావా లనూ, అజ్ఞానాన్నీ రేపేవారే నాయకశ్రేష్ఠులుగా పరిగణింప బడతారు. ప్రజలు నమ్మిన అబద్ధాలను ఎంత గొప్పగా చేసి పెడితే, అంత గొప్ప నాయకుడౌతాడు. 'ఇవి అబద్ధాలు' అని చెప్పినవాడి మాటలు ప్రజానీకం నమ్మదు. పైగా, "అంత గొప్ప వాడు అబద్ధం ఆడతాడా?" అని ప్రశ్నిస్తుంది. అంతేగాని తెలి విగా అబద్ధాలు ఆడబట్టే అతన్ని గొప్పవానిగా చేశాం అని ఆలోచించదు. ఏఅబద్ధాలు నమ్మి ప్రజలు దాస్యంలో వున్నారో ఆ అబద్ధాలను బాగా నమ్మించటంవల్లే ఒకడు నాయకు డౌతు

న్నాడు. నిజం తెలుసుకోటానికి మళ్లీ ఆ నాయకత్వమే 'గొప్పతనం' అనే సాకుతో అడ్డు తగులుతూ వుంటుంది. మనం గొప్పవాడు అనబట్టి ఒక వ్యక్తి ప్రజల దృష్టిలో గొప్పవాడయ్యాడనీ, కాదంటే కాకుండా పోతాడనీ వీళ్ళు ఆలోచించరు. "గొప్పవాడు కనక గొప్పవాడే! గొప్పవాడు కనక ఏం చెప్పినా నమ్మాలి!" అనుకుంటారు.

దీనికి తగ్గట్టు పుస్తకాలూ పేపర్లూ కూడా ఈ దృష్టినే ప్రోత్సహిస్తవి. ఇవన్నీ కూడా ఆ కొద్దిమంది చేతుల్లో వున్న వేగా! ఆ కొద్దిమందీ తమ స్వార్థం కోసం ఉపయోగించుకునే సాధనాలేగా! తెలిసి కొందరూ, తమకు నష్టమైనా అబద్ధాలు నమ్మి కొందరూ ప్రచారం చేస్తారు.

## పల్లెటూరి జీవితం

ఇప్పటి పల్లెటూరి జీవితం ఈ అబద్ధాలన్నిటి వల్లా క్షోభ పడుతూ వుంది. ఇప్పటి పల్లెటూరి నాగరికతకు ఈ అబద్ధాలే పునాది. పల్లెల్లో వున్న రైతునీ, పల్లెటూరి జీవితాన్నీ తలుచుకున్నప్పుడల్లా నాకు బేట్స్ కథ జ్ఞాపకానికి వస్తుంది. అతడు ఆ కథలో ఒక వ్యక్తి పొట్ట కోసం యంత్రం లాగా తయారై పోయి, జీవితాన్ని మృగదశకు ఎంత దగ్గరకు తీసుకు పోయిందీ వ్రాశాడు:—

ఒక పురుషుడున్నాడు. అతని కొక భార్య(?) వుంది. ఆమెకు కొన్ని సంవత్సరాలనుంచీ జబ్బు — ఎప్పుడూ మంచానపడే వుంటుంది. అతడు ఆమెను ప్రశ్నిస్తాడు.

"ఎలావుంది? ఏమైనా మార్పుందా?"

"లేదు," అని బలహీనంగా చెపుతుంది.

"గది ఇదివరకట్కంటే వెచ్చగావుంది. అవునా ?"

"అవును కొంచం వెచ్చగావుంది!"

"డాక్టరు వెచ్చగావుంటానికి పొయ్యి పెట్టమన్నాడు. కాని నీకు అక్కర్లేదనుకుంటాను. కావాలంటే వుంచుతాను."

"వొద్దు......వెచ్చగానేవుంది."

"ఈ గదిలో ఎన్నడూ పొయ్యిపెట్టలేదు. ఇప్పుడు పెట్టవలసిన అవసరం ఏముంది? ఏమంటావు ?"

"అవసరంలేదు"

ఆమెజబ్బు నయం అవటానిగ్గాను డాక్టరు ఆగదిలో పొయ్యి పెట్టమన్నాడు. కాని ఖర్చవుతుందని అతని కాపని చెయ్యటం ఇష్టం లేక, భార్యచేత వొప్పించటానికి తానే జవాబులు అందించి తృప్తిపడుతున్నాడు. ఆమెకూడా ఆ వాతావరణంలో పెరిగిన మనిషే అవటంవల్ల (సహధర్మచారిణికూడా యేమో !) అనుకూలంగా జవాబులు చెబుతుంది.

భర్త ఆమెతో ఇట్లా మాట్లాడుతూనే ఆమె చనిపోతే సమాధి ఎట్లా చెయ్యాలో ఆలోచిస్తూ వుంటాడు.

ఈ మనస్తత్వం రైతుల్లో సాధారణంగా మనం చూస్తూనే వుంటాం. మనం ఎవరింటికైనా వెళ్తే "భోజనంచేసి వెల్దురుగాని ఉండండి," అని, వెంటనే "అయినా మా ఇంట్లో ఎందుకుంటారు లెండి!" అంటారు.

ఇంకెలా వుండగలం? మన తాత తరమా?

పైగా మనం ఉండకుండా వెళ్తున్నామని మనమీద నింద మోపుతారు. "ఎప్పుడైనా మా ఇంటికొస్తే అన్నం పెట్టబడుతుందని... వెల్తున్నారు," అంటుంది తలుపు చాటునుంచి ఆ భాగ్యశాలి.

ఆప్తబంధువు చచ్చిపోయాడని భోరున ఏడుస్తూ వుంటుంది

ఒక మహాఇల్లాలు. తేపతేపకీ చీదివేస్తూ వుంటుంది. కాని బ్రాకి కుడితి పొయ్యలేదని జ్ఞాపకంరాగానే ఏడుపంతా మరచి పోతుంది — కన్నీళ్లు తుడుచుకొని గబగబా వెల్తుంది.

ఒక రైతు కొడుకు చచ్చిపోయాడు. స్మశానానికి తీసుకొని వెళ్ళి, తిరిగి వచ్చి బాచీపెట్టు వేసుకొని జేబులో చిల్లర గుమ్మ రించి ఖర్చు దేనికెంత అయిందో లెక్క-వేసుకొని లెక్క- తేల లేదని ఇంట్లో అందరిమీదా కేకలు వేస్తాడు.

ఇవన్నీ మన నిత్యజీవితంలో జరిగేవే! ప్రత్యక్షంగా నేనెరి గిన విషయాలే!

మా ఇంటిపక్క-నే నలభైఎకరాల ఆసామి వున్నాడు. అతని కూతురు మొదటికాన్పు. డాక్టర్ని పిలవలేదు. అయిదోరోజు ఆపిల్లకి 104 డిగ్రీల జ్వరం వొచ్చింది. నేను స్నేహితుణ్ని అవ టంవల్ల చూట్టానికివెళ్తే, "డాక్టర్ని పిలిపించండి," అని అడిగింది. నేను డాక్టర్ని తీసుకువచ్చేటప్పటికి, పురిటిగదిలోనుంచి ఆపిల్ల తండ్రి కేకలు వినిపించినై.

"బోడిముండా, నాకడుపున చెడబుట్టావ్! డాక్టరుకోసం కబురుపంపావా? ఇంతవరకు నాఇంట్లో డాక్టరు అడుగుపెట్టి మెరగడు! డాక్టరు కాలుపెట్టిన ఇల్లు బాగుపడుతుందీ?"

ఈ మాటలు విని డాక్టరు తనదారిన తానువెళ్ళాడు. నాకు వొళ్లుతెవలని కోపంవచ్చింది. అతనిమీదకాదు. సంఘంమీద.

పల్లెప్రజల మనస్తత్వం ఇలా తయారవటానికి కారణంఏమిటి?

పల్లెటూళ్ళో సాధారణంగా ప్రతివానినోటా 'కర్మ' అనే మాట వింటూవుంటాం. తన కిష్టంలేనిపని ఏదిచెయ్యమన్నా 'కర్మ' పేరుమీదగా తప్పుకుంటాడు.

"మందిప్పించండి!"

"బ్రహ్మరాత డాక్టరు తప్పిస్తాడా?"

రోగిమందు లేక తగిన సపర్యల్లేక మరణిస్తాడు.—"కర్మ!"

పైగా, "డాక్టరు దగ్గరమందులు తిన్నవాళ్లంతా బ్రతికారా?" అని ప్రశ్నిస్తారు. డాక్టరు చేతుల్లో చచ్చిన వాళ్లనేచూడ గలుగుతాం గాని, డాక్టరు వల్ల బతికినవాళ్లు ఎలా లెక్కలోకి వస్తారు? బతికితే 'రోగి తన ప్రభావం వల్లే బతికాడు' అంటారాయె! "మందులు తిననివాళ్లు మాత్రం బతకటంలా?" అని మరో ప్రశ్న.

ఇదంతా కర్మసిద్ధాంతం వల్ల వచ్చిన చీకాకే! ఈ సిద్ధాంతం కూడా తమ స్వార్థం కోసం ప్రజానీకాన్ని మోసంచెయ్యటానికి కొద్దిమంది చేత సృష్టించబడిందే!

దారిద్ర్యం - బానిసత్వంలో వున్నవాళ్లు తమ కష్టాలకు 'కర్మ'ని చూపించటం మొదలుపెడితే, వీటికి కారణమైన విధానం మీద వాళ్ళకుకోపంరాదు. దాన్ని మార్చాలనే బుద్ధే పుట్టదు. పద్ధతిని మారిస్తే తమ కష్టాలు పోతయ్యని కూడా తెలియదు. ప్రతిదానికీ 'కర్మ' అనుకుంటారు. అనుభవిస్తారు.

ఇక పైవారి పెత్తనానికి అడ్డేముంటుంది? నిరాఘాటంగా సాగిపోతుంది. ఎవరు ఎదురు తిరిగితే తమ హక్కులు గాలికి ఎగిరి పోతయ్యో, వాళ్లే తమకు సహాయం చేస్తూ వుండిరి! తమ హక్కుల్ని రక్షించుకోటానికి చెప్పే అబద్ధాలన్నీ నమ్ముతూ వుండిరి. అనుసరిస్తూ వుండిరి. కాదని చెప్పిన వాళ్ళతో వాళ్లే పోట్లాడుతూ వుండిరి. హింసిస్తూ వుండిరి.

ఈ స్వార్థపరులకు ఇంకేం కావాలి?

ఇల్లాంటిదే......

## దారిద్ర్యం

గొప్ప గొప్ప రాజకీయవేత్తలూ కవులూ దారిద్ర్యాన్ని పొగిడారు. "డబ్బు అనేక వ్యసనాలకు దారితీస్తుంది. అంతకంటే పాపిష్టిది మరొకటి లేదు," అన్నారు. డాక్టరు జాన్సన్, "డబ్బు సంపాదించిన వాడికి, ఖర్చుపెట్టలేక ఒక ఏడుపూ దాచుకోలేక ఒక ఏడుపూ!" అన్నాడు. షేక్సపియర్ కూడా ఇటువంటి అభిప్రాయన్నే ఒకచోట వెలిబుచ్చినట్లు జ్ఞాపకం. మిల్టన్ సుఖమనేది బుర్రలోవుంది, మరెక్కడా లేదు అని రాశాడు. బుర్రలో వుంటానికి కారణంమాత్రం బుర్రబయటే వుందని గ్రహించలేక పోయాడు. ఇక మనసంగతి చెప్పనేఅక్కర్లేదు. మన వేదాంతం పునాదే కామినీ కాంచనాలను నిషేధించటం! రాజ్యాలను వొదిలి సన్యాసులవటం. "తిండికి డబ్బుచాలటంలేదు," అంటే "ఖర్చు తగ్గించుకో!" అనే మనవాళ్ళ సలహా. సంపాదనకు మార్గాలు వెతకమని కాదు.

మన కవులు "దారిద్ర్యంలో ఎంత సుఖంవుంది? మనకున్న సమస్యలు వాళ్ళకుండవు? మనకుండే తాపత్రయాలు వాళ్ళకుండవు! ఎప్పుడూ భార్యాభర్తలు వొకరికొకరు ఎదురుబదురుగా కూర్చుని ఎంత పవిత్రంగా ప్రేమించుకుంటారు!" అని కావ్యాలు రాస్తారు. కావాలని దారిద్ర్యాన్ని కావిలించుకున్న వాళ్ళని కీర్తిస్తారు. ఒకరికి ఆస్తిని విడిచిపెట్టటమే గొప్పగా చెపుతారు. అంతేగాని ఆ 'త్యాగధనుడు' కూడా ఈ స్వార్థపరుల మాటలువిని మోసపోయాడేమో అని ఆలోచించరు. దారిద్ర్యాన్ని పొగట్టంవల్లా, డబ్బు సంపాదించటంలో సుఖం లేదని చెప్పటంవల్లా, ప్రజానీకం తన స్థితితో తాను తృప్తిపడి

ఊరుకుంటుంది. ఇదివరకే సంపాదించి పెట్టుకున్న వాళ్ళకి ఇంత కంటే ఏం కావాలీ? ఆ సంపాదన పెంచుకోటానికి కూడా ఇదే మంచి అవకాశం. ప్రజానీకం మత్తులో అజాగ్రత్తలో వుంటుంది. అప్పుడే స్వార్థపరులు జేబులు తవుడుతారు.

"అది"—"ఇంటిది"

స్త్రీలను బానిసలగా ఉంచటానికి వీరాడిన పచ్చిఅబద్ధాలు ఇన్నని చెప్పటానికి వీల్లేదు. 'స్త్రీ పతివ్రతగా ఉండాలి;' అన్నారు. 'భర్తకు సహధర్మచారిణిగా ఉండాలి;' అన్నారు. అంటే భర్తను ప్రశ్నించటానికి వీల్లేదు. భర్తకు తాగటానికి డబ్బులేకపోతే, మంగళసూత్రం ఇచ్చిపంపాలి. మరొకస్త్రీ మీాద భర్తకు మనస్సయితే, తాను తార్చాలి! సీతమ్మవారే ఆదర్శం—శకుంతల కూడా కాదు.

అబద్ధాలను నమ్మించి భర్తను తమకు బానిసగా చేసుకొని, 'భార్య భర్తను అనుసరించాలి' అని చెప్పారు. అంటే ఈ బానిస ఒక్క భర్తకే బానిసకాదు—పరోక్షంగా తమకే బానిస. ఏస్త్రీ అయినా, ఈ నాగరికతకూ, ఈ బానిసత్వానికీ ఎదురుతిరిగితే, సంఘంలోనుంచి వెలివెయ్యటానికి ఈ బానిసలే ముందు నడుంకట్టుకొని వొస్తారు. పురుషుడు భార్యని తనతో సమానంగా చూట్టానికి ప్రయత్నిస్తే (ఒసేయ్ అనటానికి బదులు పేరుపెట్టిపిలవటం, ఇంటిదిఅనే బదులు మాముసల్ది అనటం వగైరా) ముందుగా చీదరించుకునేదే స్త్రీ! ఇరుగుపొరుగు అమ్మలక్కలంతా చేరి విడ్డూరంగా చెప్పుకుంటారు. బుగ్గమీాద వేలుపెట్టుకొని, "మొగాడు ఏదైనా చేస్తాడు! ఆడదానికి ఆమాత్రం బుద్ధి ఉండక్కర్లా? ఇదేంపోకడల?" అంటారు.

బానిసత్వం స్త్రీలల్లో ఎంత జీర్ణించుకుపోయిందో దీన్నిబట్టి తెలుస్తుంది. ఇప్పటి నాగరికతకు ఎదురు తిరిగిన స్త్రీని శిక్షించటానికి స్త్రీలే ముందుగా తయారవుతారు. తన వేల్తో తన కన్నే పొడుచుకొని సంతోషించుకునే అజ్ఞానదశలో వుంది స్త్రీ.

## ముగింపు

పల్లెటూరి ప్రజలు ఇటువంటి అబద్ధాలను తెలుసుకునే శక్తినీ, చైతన్యాన్నీ, జ్ఞానాన్నీ సంపాదించుకోవాలి. తమకు ఏం కావాలో తెలుసుకునే స్థితికి రావాలి. తమకు విరోధు లెవరో తెలుసుకోవాలి. అంటే ప్రస్తుతం వాళ్లు అనుకరిస్తున్న బానిస నాగరికతనూ సంస్కారాన్నీ వొదులుకోవాలి. తమ మీద పెత్తనం చేసేవాళ్ల నాగరికతను అనుకరించటం బానిసజాతి లక్షణం. ఆ నాగరికత లక్షణం ప్రజానీకాన్ని దాస్యంలో అట్టిపెట్టటమే! ఈ సంగతి ప్రజానీకం తెలుసుకుంటే అభివృద్ధి మర్నాడే కలుగుతుంది.

ఇప్పుడిప్పుడూ పల్లెటూళ్ళల్లోని యువకులు ఈ అబద్ధాలను గ్రహించి ఈ నాగరికతకు ఎదురు తిరుగుతున్నారు.

ఇది శుభసూచకం.

కాని పెద్దలను కనిపెట్టి వుండాలి. "ఆకతాయి" "రెటమతస్తుడు", "రౌడీ" అని పేర్లుపెట్టి వాళ్ళ ఉత్సాహాన్నీ, పట్టుదలనీ పోగొట్టటానికి చూస్తారు. ఎరిగినంతవరకు ప్రజల్లో వీళ్ళ మీద సదభిప్రాయం లేకుండా చెయ్యటానికి చూస్తారు. యువకులు వీటికి బెదరకుండా గట్టిగా నిలబడ గలిగితే పల్లెటూరి జీవితం ఒక మెట్టు ముందుకు వెళ్లినట్లే. ఈ ప్రసంగాల్లో క్రిష్ణయ్య అనే పాత్రని సృష్టించింది ఇది నిరూపించటానికే!



ఇవీ వృత్తరాలు—పల్లెటూళ్లు నిజంగా ఇంత ఘోరంగా వున్నాయా అంటారేమో! కోటేశ్వరరావు సంగతి నాకు తెలుసు. కవి కాదు గనక ప్రకృతి దృశ్యాలనీ, పైరగాలికి ఒయ్యారంగా ఊగే పైరునీ, మంచెమీదనుంచి ఒడిశాల తిప్పే పడుచు సౌందర్యాన్నీ వర్ణించకుండా మానవుల్ని గురించీ, వాళ్లుపడే బాధల్ని గురించీ వ్రాస్తున్నాడు.

—గోపి



గున్నేరు

౨-౧౦-౧౯౪౧.

గోపీ,

నీవుత్తరం అందింది. మనవాళ్ళందరికీ చదివి వినిపించాను. అంతా చాలా సంతోషించారు. నువ్వు మమ్మల్ని మరచిపోనందులకు కృతజ్ఞులం. ఇన్నాళ్ళూ నువ్వెక్కడుందీ కూడా తెలియక బాధ పడ్డాం. ఒకసారి బొంబాయిలో వున్నావనీ, ఒకసారి కలకత్తాలో వున్నావనీ, ఒకసారి మద్రాసులో వున్నావనీ వార్తలు వస్తుండేవి. మొన్న సుబ్బారావొచ్చి నువ్వు జపాన్లో వున్నావని చెప్పాడు. మేమీ విధంగా వేదనపడే సమయంలో నీవుత్తరం వొచ్చింది. మేమెంత ఆనందించి వుంటామో వూహించుకో!

రంగయ్యా, క్రిష్ణయ్యా, వెంకటేశ్వర్రావూ అంతా, నిన్ను మరీ మరీ అడిగామని రాయమన్నారు. అక్కడి సంగతులు తరచు రాస్తూ వుండవలసిందిగా కోరారు. సుబ్బారావు మాత్రం ఇంకా నువ్వంటే ఈర్ష్యతో కుళ్ళుతూనే వున్నాడు. పిల్లిమీద ఎలికనీ, ఎలికమీద పిల్లినీ పెట్టి మన వూరంతా రొచ్చు రొచ్చు చేస్తున్నాడు.

వాడి ఖర్మం. అసూయతో ఎప్పుడూ కుళ్ళిచావటం తప్ప ఒక్క క్షణం సుఖపడి ఎరగడు.

ఇక్కడి సంగతు లన్నీ వ్రాయమని రాశావు. ఈనాటి పల్లెటూళ్ల సంగతి ఏమని రాయను? నువ్వున్నప్పటికీ, ఇప్పటికీ ఎంతో తేడా వుంది. క్షణ క్షణానికీ విపరీతమైన మార్పు లొస్తున్నయ్.

మన చెరువుగట్టుమీది రావిచెట్టు నీకు జ్ఞాపకం వుందనుకుంటాను. ఆ చెట్టుకింద మనం పొద్దున్నే మొహాలు కడుక్కొని కోతి కొమ్మచ్చు లాడుకొనేవాళ్లం. మొన్న పంచాయితీవాళ్లు, ఆ చెట్టు కొట్టించివేశారు. కారణం మరేమీ లేదు. ఇప్పుడు పంచాయితీ అవతలపార్టీ చేతుల్లోకి వెళ్లటంవల్ల, ఉత్తరపువీధి వాళ్లు ఎప్పుడూ ఆ చెట్టుకింద కూర్చొని కబుర్లు చెప్పుకోవటం సహించలేక ఈ పని చేశారు. వెంకటేశ్వర్రావు, చెట్టుని ముట్టుకోనివ్వననీ, రైటింగ్ జరుపుతాననీ, అమీతుమీ తేలుస్తాననీ లేచాడు. కాని అదృష్టవశాత్తూ వూళ్లో పెద్దలు ఇది జరక్కుండా చేశారు. రైటింగు జరపటం మంచిపని కాదనీ, చెట్టు కొట్టివేసిన రాత్రి, అవతలపార్టీవాళ్లు అవతలగట్టున వేసుకున్న చెట్టుకింద పందిర పీకివేద్దామనీ, అప్పుడు కుక్కకాటుకి చెప్పుదెబ్బ అవుతుందనీ వెంకటేశ్వర్రావుకి నచ్చజెప్పారు. వెంకటేశ్వర్రావు సరే అన్నాడు. దీని పర్యవసానం, మన రావిచెట్టు పోయిన్నాటి రాత్రే, వాళ్ల పంది రెగిరిపోయింది. ఇలా వున్నయ్ వూరి పరిస్థితులు.

ఇక రామాలయం మాట.

ఇప్పుడు రామాలయంలో పురాణ కాలక్షేపాలు జరగటం లేదు. అప్పుడప్పుడూ ఆలయంముందు, మీటింగులు మాత్రం జరుగుతున్నయ్. రామాలయం ఇదివరకున్నస్థితిలో వుందనుకు

నేవు. శిథిలావస్థలో వుంది. దక్షిణభాగమంతా, నాని, నాని, చెరువులోకి కూలిపోయింది. పావురాళ్ళు ఇక ఈ దేవాలయం వాసయోగ్యంకాదని రెక్కలకు బుద్ధిచెప్పినయి. ప్రస్తుతం గబ్బిలాయిలుజేరి, మన దేవాలయాన్ని గుత్తికొండ బిలంగా మార్చి వేసినయ్.

వెంకయ్య మళ్ళీ ఆలయాన్ని బాగుచేయించాలని ప్రయత్నించాడు. కాని కృష్ణయ్య పడనిస్తేనా? 'ఎందుకు మళ్ళీ డబ్బు తగలవెయ్యటం? ఈ దేవాలయాలు చివ్వరికి పాఠశాలలుగా మార్చటానికూడా పనికిరావే! పిల్లలు గోలీలాడుకోటాని కూడా ధ్వజస్తంభం అడ్డొస్తుందే! ఇంకెందుకివి? పడిపోనివ్వండి, దరిద్రం వొదులుతుంది,' అని ప్రచారంచేసి దమ్మిడీ పుట్టకుండా చేశాడు. దీనికి తగ్గట్టు మరొక గమ్మత్తు జరిగింది. రామాలయం పూజారి, దేవుడికి నులకుండతో నైవేద్యం పెడుతుంటే, క్రిష్ణయ్య పట్టుకొని, రచ్చకీడ్చి, గోలగోలచేసి వొదిలిపెట్టాడు.

'నులకుండ నైవేద్యం' అంటే ఏమిటో నీకు తెలుసనుకుంటాను. దేవునికి అన్నానికి బదులు నులక వుండని అర్పించటం. దేవునికి ప్రత్యేకం అన్నం వండటం, దేవుడు తినేవరకూ తాను తినకుండా కూర్చోవటం, ఆ అన్నం వృథాగా పోనివ్వటం, ఈ బాధల్లేకుండా మన పూజారి తాను తిని, దేవునికి నులకుండ అర్పిస్తున్నాడు.

మొత్తానికి దేనివల్లయితే రామాలయాన్ని బాగుచేయించాలనే ప్రయత్నం మాత్రం కూడి రాలేదు.

రామాలయం ఇలావుంటే ఇక మన సత్రం సంగతి కూడా

ఇట్లాగే వుంది. బాటసార్లకు విడిది ఇవ్వటం, భోజనాలు పెట్ట టం మానేశారు. అందుకుగాను నెలకు పది రూపాయిల జీతం ఇచ్చి పెట్టిన గుమాస్తాను తీసి వేశారు. ఆ డబ్బుతో క్రిష్ణయ్య సత్రంలోనే ఒక గ్రంథాలయాన్ని నడుపుతున్నాడు. మంచి మంచి పుస్తకాలు తెప్పించాడు. నాలుగయిదు పేపర్లు తెప్పిస్తున్నాడు. ప్రతిరోజూ రైతుల్ని పోగుచేసి, చదివి వినిపించి, యుద్ధాన్ని గురించి చెబుతున్నాడు.

మనం వున్న రోజుల్లో వడ్లాబత్తుల వీథి ఎంత కళకళలాడుతూ వుండేదో నీకు తెలుసుగా. ఆకులు కోసేవాడొకడు, చక్రాలు తగిలించేవాడొకడు, చిత్రికపట్టేవాడొకడు, చేబాడిత్తో చెక్కే-వాడొకడు, కొలిం వూదేవాడొకడు, అంతా చిద్విలాసంగా వుండేది. ఇప్పుడదంతా పోయింది. అంతా పని లేక పట్టణాలు జేరుకున్నారు. రైతులు కావలసిన వ్యవసాయ సామగ్రి నంతా పట్టాణాల్లోనే చేయించుకుంటున్నారు. అక్కడే వాళ్ళకు చౌగ్గా గిడుతున్నయ్.

ఇదే విధంగా వూరంతా మారిపోయింది. ఒక్క వూరే కాదు. ఆచార వ్యవహారాలూ, మర్యాద మన్ననలూ, అన్నీ మారి పోయినై. ఇన్నేళ్ళనుంచీ ఇక్కడ పాతుకున్న నాకే అంతా తికమగ్గా వుంది. మొన్నటికి మొన్న పొరుగూరు పెద్దమనిషొకడు దార్నే పోతుంటే, కుర్రవాడొకడు అరుగుమీద కూర్చొని, "ఏవూరు ?" అని అడిగాడు.

పాపం, ఆ పెద్దమనిషి ఆగి, మర్యాదగా చెప్పాడు— "గుండూరు."

"అయితే నాకేం?" అన్నాడు కుర్రవాడు.

ఆ పెద్దమనిషి నిలువున నీర్రై "అడిగితే చెప్పాను," అన్నాడు.

"చెబితే అన్నాను," అన్నాడు కుర్రవాడు.

చూశావా, ఇంత అమర్యాదగా ప్రవర్తించటం మన రోజుల్లో ఎప్పుడైనా చూశామా? కాని క్రిష్ణయ్య వీటన్నిటినీ సమర్థిస్తాడు. ఇవన్నీ మంచి లక్షణాలే అంటాడు. పొరుగువాడు, ఇరుగువాడు అనే భావం పోవటమే మంచిదంటాడు. కుర్రవాళ్లల్లోని వేడి రక్తం, బానిస బుద్ధుల్ని ఛేదించుకొని మొదట్లో ఈ రూపంలో బయటపడ్డా, తరువాత దేశక్షేమానికి వినియోగపడుతుందని వాదిస్తాడు.

కాని వెంకయ్యకు ఈ వాదం గిట్టదు. వెంకయ్య ఈమధ్య పూర్తిగా వేదాంతి అయిపోయాడు. మోకాళ్లదాకానే బట్ట కట్టి, గడ్డం పెంచాడు. మొన్న ఒక స్వాములవార్ని వెంట పెట్టుకొచ్చి, భగవద్గీతమీద ఉపన్యాసం ఇప్పించాడు. కాని క్రిష్ణయ్య వూరుకోలేదు. అడ్డు ప్రశ్నలు వేసి, గల్లంతు చేసి, మీటింగు సాగకుండా చేశాడు. దానిమీద వెంకయ్య ఉగ్రుడై ఒక రాజకీయవేత్తతో మరొక ఉపన్యాసం ఇప్పించాడు. కాని అతడు రాజకీయానికి బదులు వేదాంతం బనాయించాడు. అప్పుడు రైతులకు పనుల్లేని రోజులు. చీట్లాటా, కొబ్బరికాయ పందాలతో కాలం గడిపే రోజులు. దీన్ని సాకుగా తీసుకొని వుపన్యాసకుడు—"కాలం వృధా చెయ్యకండి. పొలంపని లేని రోజుల్లో రాటం వడకండి, మగ్గం నెయ్యండి," అని ఉద్బోధించాడు. దాన్తో క్రిష్ణయ్య మండిపోయాడు. చిందులు తొక్కుతూ, "రాత్రిం బగళ్లు పదినెల్లు పనిచేశారే! రెండు నెల్లు కులాసాగా కాలక్షేపంచేస్తే యేం? ఈ మాత్రం తీరిక లేకుండా

పనెల్లా చేస్తారు? నీకేమన్నా మతి వుందా లేదా?" అని గల్లంతు చేశాడు. రైతులంతా అతనిపక్షమే మాట్లాడారు. ఔనంటే ఔనన్నారు. పాపం ఆ ఉపన్యాసకుడు కిక్కురుమన కుండా వెళ్ళిపోయాడు.

నువ్వు చూచినప్పటికీ ఇప్పటికీ రంగయ్యా కూడా చాలా మారిపోయాడు. మంచికోసం అతడెంత పాకులాడేవాడో నీకు తెలుసు. మొదట్లో అతడు మనవూరు బాగుచెయ్యాలని చాలా ప్రయత్నించాడు. రెండు పార్టీలనూ కలపటానికి చాలా తంటాలు పడ్డాడు. కాని ఏం లాభం? సుబ్బారావు వూనుకొని లేనిపోని కొండాలుచెప్పి అతన్ని రెండు పార్టీలకూ కాకుండా చెయ్యటానికి ప్రయత్నించాడు. రంగయ్యా ఆలోచించి ఒక పార్టీకి అతుక్కుపోయాడు. అప్పుడు నాతో ఈవిధంగాచెప్పాడు.

"నరకంలో వుంటూ కలలు కనటంవల్ల లాభం లేదు. పరిస్థితుల్నిబట్టి పోకపోతే ఎందుకూ పనికిరాకుండా పోతాం," అని చెప్పాడు. ప్రస్తుతం అతడు ఎలక్షన్లలో తిరుగుతున్నాడు. కోర్టుల చుట్టూ తిరుగుతున్నాడు. ఈమధ్య అవతలపార్టీ వాళ్లు రంగయ్య వాములు తగలబెట్టించారు. రంగయ్యకు కోపం వచ్చి, ఒక షాహుకార్ని పట్టుకొని, అవతలపార్టీ మనిషి పొలాన్ని వేలం వేయించాడు. ఈ విధంగా వూళ్లో కక్షలు పెరిగి రెండుపార్టీలూ. రైటింగ్ కి తయారవుతున్నాయి. అదను కనిపెట్టి సుబ్బారావు మూతా దొంగతనంగా ఆ పార్టీ వాములూ ఈ పార్టీ వాములూ తగలబెట్టిస్తూ క్రోధాలు పెంచుతూ వుంది.

ఇక నా సంగతి చెబుతాను. నా దక్షిణప్పొలం అమ్మేశాను. దక్షిణప్పొలం నీకు తెలిసే వుంటుంది. మనం చిన్నతనంలో

గట్టున తుమ్మచెట్టుకింద కూర్చొని పిల్లిమిసరకాయలు తింటూ వుండేవాళ్లం. ఈమధ్య ఆ చెట్టు కొట్టించి నాగలి చేయించాను. అప్పులబాధ పడలేక ఈ పొలం తక్కువ ధరకే అమ్మేశాను. మనం అమ్ముతామంటే కొనే వా డెవ్వడు? మన బాధలకు విచారపడే దెవ్వడు? గోపీ, నువ్వు నమ్ముతావో నమ్మవో, నిజంగా ఆపొలం అమ్మిన రోజు నే పడ్డ బాధ భగవంతుడికే తెలుసు. కళ్లవెంట నీళ్లు కారినయి. కాని ఏం చేస్తాను? ఎంత ఖర్చు తగ్గించినా పంట తిండికే సరిపోటం లేదు. అలవాట్లు ఆపలేకుండా వున్నాను. వారానికి ఒక్కసారైనా టౌన్‌కి వెళ్ల వలసి వస్తూంది. బోర్డు బళ్లో పిల్లల్ని ప్రవేశపెడితే రెండు సంవత్సరాలకు తలా, వలా, మాటలే రాలేదు. అందుకని ప్రయివేటు చెప్పిస్తున్నాను. చదువుకోసం మన దగ్గర నుంచి యింత డబ్బు వసూలు చేస్తున్నారు. కాని దాని ప్రయోజనం లేక చదువుకి మళ్లీ వేరే ఖర్చుపెట్టవలసి వస్తూ వుంది. ఎంత దుర్వ్యయమో, ఎంత కష్టమో చూడు!

పిల్లలంతా బాగానే వున్నారు. పెద్దవాళ్లిద్దరూ చదువుకుంటున్నారు. కడసారిది ఇప్పుడే నడుస్తూవుంది. ఇంట్లో ఏ వస్తువూ బతకనివ్వటం లేదు. అప్పుడే మా ఆబిడ దాని పెళ్లిసంగతి ఆలోచిస్తూ వుంది. ప్రస్తుతం ఇంతటితో ముగిస్తాను. ఇవ్వాళ పాలేరు ఇంకా పొలాన్నుంచి రా లేదు. నేనే వెళ్లి గడ్డి మోయించుకు రావాలి. అక్కడి సంగతులన్నీ వెంటనే రాయి.

ఇట్లు

**కోటేశ్వర్రావు**

పి. యస్.

మరచిపోయాను. మొక్క-జొన్నకండెలు పంపమని రాశావు. మొదటిపంట అయిపోయింది. ఇంకా పది పదిహేనురోజుల్లో గాని రెండో పంట రాదు. ఇప్పుడే కండెలు తెల్లపీచు వేస్తున్నాయ్.

మరొక్క-సంగతి. నల్లదాని చెరువు నీకు జ్ఞాపకం వుందనుకుంటాను. వెంకయ్య్య ఈ పేరు మార్పించటానికి చాలా ప్రయత్నించి జయం పొందాడు. నిన్నే పంచాయితీవాళ్లు పేరు మార్చి, 'దేశభక్తాగ్రగణ్య చెరువ్,' అని పెట్టారు.

## ii

గున్నేరు

గోపీ, ౧౬-౧౦-౧౯౪౧.

నీ వుత్తరం నిన్నే అందుకున్నాను. నా వుత్తరం ఇన్నాళ్ళు, ఎక్కడెక్కడ ప్రయాణం చేసిందా అని ఆశ్చర్యపడకు. ఇందులో నీవుత్తరం తప్పేమీలేదు. అది సక్రమంగానే వచ్చింది. కాని, విజయవాడలో దాన్ని కొన్నాళ్లు పడేసి అట్టేపెట్టారు. విజయవాడనుంచి మనవూరు వారాని కొక్కసారే బట్వాడా అని నీకు తెలిసివుండదు. ఈ రోజుల్లోకూడా వారాని కొక్కసారి టపా తెప్పించుకొని పల్లెటూళ్ళు బతుకుతున్నాయంటే, ఆ బతుకెటువంటిబతుకో ఆలోచించుకుంటే నీకే తెలుస్తుంది. రాజ్యాలే క్షణంలో మారిపోయే ఈ కాలంలో మనవూరు వారాని కొకసారి టపా వస్తుంది. ఇక మేం బతుకుతున్నట్లా, చచ్చిపోయినట్లా?

షాహుకారు బ్రహ్మయ్యకి మొన్న, ఆయన ప్లీడ రొక ఉత్తరం రాశాడు. ఇంక వాయిదా మూడురోజులే వుందనీ, వెంటనే బయల్దేరి రావలసిం దనీ దాని సారాంశం. ఆ వుత్తరం, కేసుకొట్టేసిన రెండోరోజు బ్రహ్మయ్యకి అందింది. ఇకేం చెప్పాలి? నాకూ ఒకప్పుడు ఇట్లాగే జరిగింది. నా బావమరిది తన చెల్లెలి పెళ్ళికి రమ్మని శుభలేఖ పంపిస్తే, నాగవల్లి అయిపోయిన మూడోనాడు నా కాలేఖ చేరింది. సాధారణంగా ఉత్తరాలు జేరకుండావుంటం కూడా వుంది. ఇదంతా చూచి క్రిష్ణయ్య, మనవా ళ్ళందరిచేతా దస్కత్తులు చేయించి, రోజూ టపా వచ్చేటట్టు చెయ్యవలసిందని ఒక అర్జీ పెట్టించాడు. ఇది తెలిసి సుబ్బారావు, "మాకు రోజూ టపా రానక్కర్లేదు.

వారాని కొకసారి వొస్తేనే సుఖంగా బతుకుతాం," అని మరొక అర్జీ తగిలించాడు. మరి ఈఅర్జీలో ఏం కారణాలు చూపించాడో గాని, అధికారులకి ఈ అర్జీయే నచ్చింది. మన వూరికి వారానికి ఒకసారే టపా వస్తూవుంది.

నిన్న నీ ఉత్తరం వస్తుందని, టపాబంట్రోతు కోసం ఎదురు చూస్తూ చెరువుగట్టుమీద కూర్చుంటే, దారేపోతూ సుబ్బారావు మమ్మల్ని చూశాడు. చూచి ఏం చేశా డనుకున్నావు? వూళ్లోకి వెళ్లి, "కృష్ణుని దగ్గరనుంచి వచ్చే లేఖకోసం గోపికలన్నీ చెరువుగట్టుమీద నిరీక్షిస్తున్నయ్. లేఖ రాగానే, కృష్ణునిస్థానే ఆ లేఖని పెట్టుకొని జలక్రీడ లాడతయ్," అని హేళనచేశాట్ట.

పల్లెటూళ్లలో ఇంత అసూయ ఎందుకు హెచ్చిపోతూ వుందో నాకు తెలియటం లేదు. ఒక్క సుబ్బారావు సంగతే నే చెప్పటంలేదు. సుబ్బారావు ఉదాహరణ మాత్రమే. మొత్తం అంతా అంతే! మొగుడూ పెళ్ళాలు కలిసివుంటే ఓర్వ లేరు. మూడురోజుల కొక్కసారి గడ్డం గీక్కుంటే ఓర్వలేరు. కూరలు నేత్తో తిరగమోత వేసుకుంటే ఓర్వలేరు. గడపల్లో కూర్చుని అమ్మలక్కలూ చెరువు గట్టుమీద కూర్చుని అయ్యలూ ఒక్కసారి గొల్లుమంటారు.

ఈ వాతావరణంలో నీ అంటివాడు ఒక్క నిమిషం బతక లేడు. మొన్నటికి మొన్న కిష్టయ్య, చెర్లోనుంచి నీళ్లు తెచ్చుకో లేక, రోజుకి అర్ధణా ఇచ్చి నీళ్లు పోయించుకుంటూ వుంటే ఊరంతా ఒక్కసారి గుప్‌మంది—"పాపయ్యమామ సంపాదించి పోయాడు, వీడు తన ఎదాన వేసుకుంటున్నాడు," అన్నది వొక ఆరిందా- మెటికలు విరిచింది. "దీపం" అన్నా డొక యువకుడు.

"ఎన్నాళ్ళో ఈ వెలుగు? చూడం?" అన్నాడొక బంధువు. "నడమంత్రం సిరి" అని ప్రచారం చేశాడు సుబ్బారావు. ఇరుగు పొరుగు అమ్మలక్కలందరూ కృష్ణయ్య భార్య చుట్టూ జేరి "అయ్యో మద్దెం! ఇదేం సోద్దెం? ఇంకేం కాపరం నిలబెడతా డమ్మా?" అని చెప్పి వాళ్ళిద్దరిమధ్యా పోట్లాట పెట్టారు.

ఈ అసూయకీ, కజ్జాలకీ కారణం సంస్కారం లేకపోవటం అంటారు మీవంటివాళ్ళంతా. పల్లెటూళ్లో బతికేవాళ్ళకి సంస్కారం రమ్మంటే ఎలా వస్తుంది? అసలు ఈ లోకంలో అవకాశం ఏది? ఆడవాళ్ళు కోడికూసినప్పుడు లేస్తారు. మజ్జిగ చెయ్యాలి, పాచి వూడవాలి, కళ్లాపి జల్లాలి, అంట్లు తోమాలి, అన్నం వండాలి. పొలం బువ్వ పంపాలి, అన్నం పెట్టాలి. ఇవన్నీ పూర్తయి, అన్నాలయ్యేసరికి రెండుఝాములు దాటుతుంది. మళ్లీ నాలుగుగంటలనుంచీ మొదలు. రైతు రైతుగా బతకాలంటే అతని జీవితం ఇల్లాగే వుంటుంది. అందుకనే— "ఈ జీవితంలోనేవుంచి సంస్కారంచెయ్యాలంటే లాభంలేదు, ఈసిస్టొన్నే పోగొట్టాలి,"అంటాడు క్రిష్ణయ్య. ఈమాటల్లోని యదార్థం నాకిప్పుడిప్పుడూ తెలుస్తూవుంది. ఈ కామాటంలోనుంచి తప్పించుకొని బయటపడ్డవాళ్ళని చూచి క్రిష్ణయ్య సంతోషిస్తాడంటే, ఎందుకు సంతోషించడు?

నీవుత్తరంలో, ఏరువాక పండగ ఎలా జరుగుతూ వుందో రాయమన్నావు. ఇంకా ఏరువాక పూర్వంలాగా జరుగుతూ వుందనేనా నీ వుద్దేశం? ఇప్పుడా నాగలిపూజల్లేవు. పాలేర్లకి కొత్తబట్టల్లేవు. బీదలకి ధాన్యం దానం చెయ్యటంలేదు. అసలు ఆమాటకొస్తే, రైతులిపుడు పొలంపనే మానుకుంటున్నారు.

పొలాలన్నీ మగతాలకిచ్చేస్తున్నారు. సొంత వ్యవసాయం గిట్టుబాటవకపోగా, చేతిచమురు వొదుల్తూ వుంది. ఇక ఏరువాక చేయించేదెవ్వరు ? చేసేదెవ్వరు ? ఎడ్లను భరించలేక, కూలికి నాగళ్ళను పిలిపించటంకూడా మొదలుపెట్టారు రైతులు.

వెంకటేశ్వర్రావు నీకు తెలుసుగా. అతడు చాలా చిన్న రైతు అవటంవల్ల, ఒక్కడూ ఎద్దుల్ని భరించలేక, పెత్తండ్రితో కలిసి ఉమ్మడి వ్యవసాయం చేయించుకునేవాడు. వెంకటేశ్వర్రావుకి ఒక ఎద్దుండేది. అతని పెత్తండ్రికొక దున్నపోతుండేది. ఈ రెంటినీ కలిపి వాళ్లు వ్యవసాయం చేసుకునేవారు. కాని, నిరుడు ఎలెక్షన్ సందర్భంలో ఇద్దరికీ కలతలు కలిగినయ్. దీనికీ సుబ్బారావే కారణం. లేనిపోయిన కొండాలుచెప్పి వాళ్ల మనస్సులు విరిచాడు. వెంటనే వాళ్లు ఎవ్వరికి వారే సేద్యం చేసుకోటానికి ప్రయత్నించారు. కాని, వెంటనే వెంకటేశ్వరరావు మరొక ఎద్దుని కొనలేకపోయాడు— అతని పెత్తండ్రి మరొక దున్నపోతుని కొనలేకపోయాడు. ఇద్దరూ తమ భూముల్ని మగతాకిచ్చుకూర్చున్నారు. క్రిష్ణయ్య నీ వుత్తరం చదివి "ఇంకా నాగలి పూజలూ పుట్టల పూజలూ చేస్తూ కూర్చున్నామనుకున్నాడా? ఆ నాగరికతను దాటాం అని రాయి," అని చెప్పాడు. గమ్మత్తేమిటంటే, ఈమార్పులన్నిటికీ అతడు సంతోషిస్తాడు!

ఈ విధంగా వుంది. వున్న భూమి పల్లెటూళ్ళలో వున్న జనాభాకి చాలక బాధపడుతున్నారు. ఇక్కడ ఇల్లా వుంటే టౌన్ పెద్దలు "పదరా పోదాము పల్లెటూరికీ," అని ప్రచారంచేస్తున్నారు. ఎంత ఘోరం! భూదేవి ఉన్న బరువే మొయ్యలేక నడు

ములు విరిగి చస్తుంటే పట్టణవాసుల్నికూడా పల్లెటూళ్ళకి పొమ్మని ప్రచారం చేస్తున్నారు. ఉన్నవాళ్ళే గడవక పట్టణాలు చేరుకుంటున్నారు. ఏదో వ్యాపారం చేసుకుంటున్నారు. ఒకరు కాఫీహోటలు పెట్టారు. ఒకరు కోడిగుడ్లవ్యాపారం పెట్టారు. ఒకరు వెన్నో నెయ్యో టౌన్‌కి పంపుతున్నారు. వీళ్లు ప్రచారం చేస్తున్నట్లు పట్టణవాసులు పల్లెటూళ్లొస్తే, పల్లెటూళ్లలో వున్న వాళ్ళు పట్టణాలు జేరుకోవలసివస్తుంది.

ఏదో మాట్లాడుతారు. ఏదో ప్రచారం చేస్తారు.

మొన్నటి ఉత్తరంలో దీపావళి సంగతి రాయటం మరచిపోయాను. మన చిన్నతనంలో వూరంతా ఆముదపు దీపాల్తో పచ్చతోరణంగా వుండేది. మతాబులు, పువ్వొత్తులు, పొట్లాలు, గోగుమంటలు కన్నుల పండగ్గా వుండేది—కుర్రవాళ్లకి ఎంతో ఉత్సాహంగా ఉండేది! కిష్ణయ్య ఇవన్నీ మానిపించి ఆ డబ్బు గ్రంథాలయానికి పోగుచేసి, వెంకయ్య దగ్గర వుంచాడు. ఇప్పుడు వెంకయ్య ఆ డబ్బివ్వటం లేదు. వెకంయ్య నడిగితే "సుబ్బారావు వొద్దంటున్నాడు" అంటాడు! సుబ్బారావు నడిగితే, "మరుగుదొడ్డి కట్టిస్తే బాగుటుందేమో," అన్నాడు. "పోనీ అలాగే చేద్దాం" అంటే, "వొద్దు గ్రంథాలయానికే ఖర్చు పెడధాం" అన్నాడు. ఈ విధంగా, కాలికివేస్తే వేలికీ, వేలికి వేస్తే కాలికీ వేసి డబ్బు మాత్రం రాకుండా చేశాడు.

గేదె అడలుతూ వుంది, గుప్పెడుగడ్డి దానిముందు వెయ్యాలి. దూడపోయినప్పటినుంచీ పాలివ్వకుండాగోలచేస్తూవుంది. సెలవా ?

అన్నట్టు ఈ మధ్య నాకూ పెదనాన్నకీ ఘర్షణజరిగింది. పెదనాన్న నీ పొలంగట్టు ఒక అరగజం లోపలికి నరికాడు. నే నడి

గితే "మధ్య నీ కెందుకు? మావాడి సొమ్ము నే తినగూడదూ?" అని పోట్లాడాడు. ఏం చెయ్యమంటావో చెప్పు.

మనవాళ్లంతా యుద్ధం సంగతులు తెలుసుకోవాలని తహ తహలాడుతున్నారు. క్రిష్ణయ్య రోజూ సైకిల్ మీద టౌన్ కివెళ్లి, పత్రిక కొనుక్కొచ్చి అందర్నీ పోగుజేసి, చదివి వినిపిస్తు న్నాడు. పత్రిక రాగానే—

"రష్యా ఎట్లా వుంది ?"

"మాస్కో ఎట్లా వుంది ?"

"ఇంగ్లండు ఎన్ని విమానాలు పంపింది ?"

"మంచు కురవటం మొదలు పెట్టిందా ?"

"మాస్కో పోతే ఏ మవుతుంది ?"

అని ఎవ్వరికి తోచిన ప్రశ్నలు వారు వేస్తుంటారు. మొత్తానికి అందరికీ —ఒక్క సుబ్బారావుకి తప్ప— రష్యా గెలవాలనే వుంది. సుబ్బారావుకి మాత్రం ఎవ్వరూ గెలవాలని లేదు.

అదిగో మళ్లీ గేదె అరుపు...

ఇట్లు
కోటేశ్వర్రావు

## iii

గున్నేరు
గోపీ, ౧౫—౧౧—౧౯౪౧.

వానలు జోరుగా కురుస్తున్నయ్. వానలంటే చిన్నప్పుడు ఎంత సంతోషంగా వుండేది! నువ్వు కత్తిపడవ చేసేవాడివి; నేను బోటుపడవ చేసేవాణ్ణి. నాకేమో కత్తి పడవ చేతయ్యేది కాదు—నీకేమో బోటుపడవ చేతయ్యేదికాదు. అందుకని, నాపడవ గొప్పదంటే నాపడవ గొప్పదని, పందాలు వేసుకొని, నీళ్ళల్లో వొదిలి, చప్పట్లు కొట్టుకుంటూ గంతులు వేసుకునే వాళ్ళం. జ్ఞాపకం వుందా?

మొన్న నేనొక పుస్తకం చదివాను. అందులో కవి, "జోరున వాన కురుస్తుంటే, ఇంట్లో కూర్చొని, కిటికీలోనుంచి చూస్తూ వుంటే ఎంత బాగుంటుంది?" అని వ్రాశాడు. చెప్పొద్దూ— నాకు చాలా కష్టం వేసింది. చిన్నప్పుడు కూడా, మనం వానల్లో తడుస్తూ ఆడుకొని సంతోషించాం గాని, లోకమంతా నీళ్ళల్లో మునిగి తేలుతూవుంటే, ఇంట్లో కూర్చొని, వెచ్చగా శాలువా కప్పుకొని సంతోషించి ఎరగం. రోజులు మారిపోతున్నయ్. ఇప్పటి కవులు ఎదటి వాళ్ళకష్టాల్తో పోల్చుకొని గాని, సుఖపడ లేకుండా వున్నారు.

ఇప్పుడు వానలు కురవటం మాకర్మే! బయటకు వెళ్ళకుండా మాకు ఒక్క క్షణం జరగదు. బయటికి వెళ్ళటానికి, మోకాలు లోతు బురద. మన రోడ్డుమీద, బోర్డువారు ఇంత కంకర కూడా చల్లించలేదు. బోర్డు ఎలెక్షన్లలో, మన పార్టీ సాంబయ్యకి వోటు చెయ్యలేదని, మన రోడ్డు లిస్టులో వున్నప్ప

టికీ, ప్రెసిడెంటు పడనివ్వటం లేదు. పాపం, దీనివల్ల, సొబ్బయ్యకి వోటు చేసిన అవతల పార్టీకూడా, మనలాగే బురదలో తిరగలేక బాధపడుతూవుంది.

మరుగుదొడ్లు లేకపోవటంవల్ల, వానల్లో పల్లెటూళ్ళు పడే యాతన చెప్పుకోటానికి సిగ్గుచేటుకూడాను. ఆ కష్టాలన్నీ చెప్పుకుంటే నీబోటివాళ్ళు 'అసభ్యం' అని చీదరించుకొంటారేమోనని భయం. ఊరికి ఉత్తరంగా మరుగు దొడ్డికి ఉపయోగించుకునే తోపుండేది చూడు. దాన్నిమధ్య సాహుకారు బ్రహ్మయ్య దరఖాస్తుపెట్టి, అధికార్లను కూడకట్టుకొని, తన వాములు పెట్టుకోటానికి మంజూరు చేయించుకున్నాడు. "అంతా వాడి ఎదానే వేసుకోమను! పోయేటప్పుడు కట్టుకుపొమ్మను," అని తిట్టిపోస్తున్నారు ప్రజలు. క్రిష్ణయ్య సమయం కనిపెట్టి, బోరింగు దొడ్లు కట్టించటానికి ప్రయత్నిస్తున్నాడు.

నాలుగురోజుల్నించీ వానలు మరీ ఎక్కువగా వున్నాయి. ఆకాశం తూట్లుపడ్డట్టుగా కురుస్తూ వుంది. ఈ విధంగా ఇంకా నాలుగు రోజులుంటే, ఈ సంవత్సరం రైతులంతా మడత కూడుములు తినాల్సిందే. వరి ఇప్పుడే ఈన్తూవుంది. గింజలు పాలు పోసుకోటానికి నోరు తెరుచుకొని వున్నాయి. సుంకుపట్టింది. ఈ గాలివానకు సుంకు రాలిపోతే మా కర్మంకాలినట్లే. సుంకు రాలిపోతే గింజ పాలుపోసుకోదు. తప్పగింజ అవుతుంది. సంవత్సరం పొడుగునా కష్టపడి, ఈ తప్పగింజల్నీ, మానుగాయల్నీ ఇళ్లల్లో పోసుకొని ఏం తినాలి? ఈ వానే స్వాతి కార్తె మధ్యలో కురిస్తే కంకె సరిగ్గా ఈనేది. అప్పుడేమో వానల్లేవు. విశాఖ కార్తిలో ఈ వానలొచ్చి ఈనిన కంకెలకు

ఎసరు పెడుతున్నై. ఎక్కువ వానలు కురవటంవల్ల మెట్టపైర్లు వెయ్యటానిక్కూడా వీల్లేకుండా వుంది.

మాస్థితి ఇట్లావుంది. దేముడు కూడా పట్టణవాసిలాగున్నాడు. అందరితోపాటు అతనికీ పల్లెటూళ్లంటే ఎగతాళేనా ?

వీటన్నిటికంటే బుడమేరు భయం మరీ ఎక్కువగా వుంది. మన వూరిపక్కగా పారే బుడమేరు నీకు జ్ఞాపకం వుందా? మన చిన్నతనంలో వరదలబాధ పడలేక, మనవాళ్ళు అరక్కంతని చందాలు వేసుకొని, ఏటికీ వూరికీ మధ్యగా ఒక పెద్ద కట్ట పోయించారు. కాని ఇంతడబ్బు ఖర్చుపెట్టినా వరదల భయం మాత్రం పోలేదు. నాలుగు సంవత్సరాల క్రిందట బుడమేరు పొంగి కట్టను కోసుకొని, చేలమీద పడి పంటంతా నాశనం చేసింది. ఇప్పుడు మళ్ళీ ఆ పరిస్థితే వచ్చింది. ఈ వానలకు, ఏరుపొంగి కట్ట అంచుల్ని తంతూ వుంది. ఎప్పుడు కట్ట తెగుతుందోనని భయంతో, రైతులు జోరున కురిసే ఈ వానలో, తిండీ తిప్పలూ లేకుండా, రాత్రింబగళ్లు కాపలా కాస్తున్నారు.

నాకు తెలియక అడుగుతాను. బుడమేరు ఇంత నష్టపరుస్తూ వుందిగదా! రైతుల గుండెలమీద కుంపటిలాగా వుంటూ వుందిగదా! దీని వరదలనుంచి రైతుల్ని రక్షించే ఉపాయం ఏమీ లేదూ? వరదలు పంటభూములమీదకు పారకుండా చేసే వీలేమీ లేదూ? చిన్నప్పుడు ఈ బుడమేరుని గురించి మా అమ్మమ్మ ఒక కథ చెబుతూ వుండేది:—

అసలు బుడమేరుకి ఏడుగురు అప్పాచెల్లెళ్ళట. తండ్రి రెండో పెళ్ళి చేసుకొని సవతితల్లి మాటలు విని, ఈ కూతుళ్ళని ఇంట్లో

నుంచి వెళ్ళగొట్టారట. ఈ ఏడుగురు అప్పాచెల్లెళ్ళూ అడవుల్లో తిరిగి తిరిగి అలసి ఒక చెట్టుకింద నిద్రపోయారట. నిద్రపోబోయే ముందు, ఏమైనాసరే, మనం ఒకళ్లనొకళ్లు విడిచిపెట్టగూడదు, అనుకున్నారట. కాని బుడమేరు ఒక రాత్రివేళ లేచి, అప్పా చెల్లెళ్లకు చెప్పకుండా వెళ్లిపోయిందట. తెల్లవారి లేచి చూస్తే బుడమేరు లేదు. మిగిలిన అప్పాచెల్లెళ్లకు కోపంవచ్చింది. ఈ విధంగా శపించారు—"నీ నడక పామునడక అవుగాక! నీవల్ల రైతులకు ఏవిధమైన ఉపయోగం వుండకపోవుగాక!!"

అధికార్లకూడా ఈ శాపం తెలుసో ఏమో! శాపవిమో చనం చెయ్యటం ఇష్టం లేదో ఏమో! మేము అర్జీలు పెట్టు కుంటూనే వున్నాం; వరదలు వస్తూనే వున్నాయి. పంట కొంపకి జేరేవరకూ దడదడే. దినదిన గండం నూరేళ్లాయుస్సులాగుంది మా బ్రతుకు. ఒక్కొక్కప్పుడు, ఈ బ్రతుకు బ్రతకటం ఎందుకా? అనిపిస్తుంది.

నీ వుత్తరంలో రైతులకు వ్యవసాయం ఎలా గిట్టటం లేదో, రైతులకు గిట్టని వ్యవసాయం మగతాదార్లకు ఎలా గిడుతూ వుందో వ్రాయమని రాశావు. చెబుతాను.

ఉదాహరణకు పది ఎకరాల రైతుని తీసుకుందాం. అతని ఖర్చూ, రాబడీ, తేల్చుకుంటే సత్యం నీకే తెలుస్తుంది.

— ఖర్చు —

పది ఎకరాలకు

| | | | |
|---|---|---|---|
| ౧. ఆకుమడికి | — | — | ౧౦-౦-౦ |
| ౨. ఎరువు తోలటానికి | — | — | ౧౫-౦-౦ |
| ౩. దమ్ముచెయ్యటానికి | — | — | ౨౫-౦-౦ |

| | | | | |
|---|---|---|---|---|
| ౪. | నాటుకి | — | — | ౨౦-౦-౦ |
| ౫. | కలుపుకి | — | — | ౧౦-౦-౦ |
| ౬. | కోతకి | — | — | ౨౦-౦-౦ |
| ౭. | కుప్పవెయ్యటానికి | — | — | ౧౫-౦-౦ |
| ౮. | నూర్పిడికి | — | — | ౨౦-౦-౦ |
| ౯. | గడ్డితోలటానికి | — | — | ౧౦-౦-౦ |
| ౧౦. | ఎండాకాలం చేలు బాగుచేయటానికి | | — | ౨౫-౦-౦ |
| ౧౧. | వడ్రంగికి | — | — | ౮-౦-౦ |
| ౧౨. | మాదిగవాడికి | — | — | ౮-౦-౦ |
| ౧౩. | సాలీనా పాలేళ్లకు | — | — | ౧౫౦-౦-౦ |
| ౧౪. | శిస్తుకి సెస్సులతో సహా | — | — | ౧౦౯-౬-౦ |
| | మొత్తం | | — | ౪౪౫-౬-౦ |

## — రాబడి —

## పది ఎకరాలకు

ఎకరానికి పది బస్తాలు; బస్తా అయిదు రూపాయిాల చొప్పున పదిఎకరాలకూ అయిదువందల రూపాయిాలు. అంటే మొత్తం పది ఎకరాల వ్యవసాయానికీ గాను రైతుకు మిగిలేది ఏభైనాలుగు రూపాయిల పది అణాలు.

చూశావా? ఈ స్వల్ప ఆదాయంతో రైతు తన భార్యా బిడ్డల్ని పోషించుకోవాలి. అందుకనే పల్లెటూళ్ళల్లో సంబారు కారం ఆవకాయపచ్చడీ ప్రసిద్ధి కెక్కినయ్. ఎక్కువచేసి చెప్పటంకాదు.

ఈమధ్య పుల్లయ్య నాతో తనసంగతి ఈవిధంగా చెప్పాడు— "నేను మా అత్తారింటికి ఇల్లరికం వెళ్ళి పది సంవత్సరాలైంది.

అప్పటినుంచీ దమ్మిడీ నా సొంత ఆస్తిలోది ముట్టుకోలేదు. మా ౧౪ ఎకరాలూ మా అన్నయ్యే చేయిస్తూ వుండేవాడు. మొన్న పంచుకుందామని లెక్కచూచేటప్పటికి రు. ౧౪౦౦ అప్పు తేలింది. మా అన్నయ్య దుబారా చేసింది ఏమీ లేదు. లంక పుగాకు మాత్రం కాల్చేవాడు."

ఇలా వున్నయ్ రైతు పరిస్థితులు.

దీనికి తగ్గట్టుగా, వున్న పది ఎకరాలూ తలోకచోటా వుందా, ఆ రైతు బాధ భగవంతుడికే తెలియాలి! సాధారణంగా రైతుకి పొలం, ఆ దిక్కున ఒక ఎకరం, ఈ దిక్కున ఒక ఎకరమే వుంటుంది. దీనివల్ల అన్ని ఖర్చులూ పెరిగి పోతయ్. కూలీలు ఎక్కువమంది కావలసివస్తారు. వేరు వేరు కుప్పలు వెయ్యాల్సి వస్తుంది. వేరు వేరు కల్లాలు చెయ్యాల్సివస్తుంది. దుబారా ఎక్కువ అవుతుంది. రైతులకు వున్న పొలం ఒకచోటే వుండే సదుపాయం చెయ్యకపోవటం, చాలా ఘోరం.

పరిస్థితులిలావుంటే, వ్యవసాయం, మగతాదార్లకు ఎలా గిడుతుంది? అనే అనుమానం నీకు కలగవచ్చు. అదీ చెబుతాను—

సాధారణంగా పెద్దరైతు కమతాల్లో తిరిగేవాళ్ళు, ఒకయెకరం రెండెకరాలు మగతాకు తీసుకుంటూ వుంటారు. సందుసందున ఆరైతుని బ్రతిమాలి, ఎద్దుల్నీ సామానుల్నీ వాడుకుంటూ వుంటారు.

'ఒక పూట నాగలి కావాలి దొరా? ఈ పూట బండి కావాలి దొరా? రెండు కట్టలు నారివ్వు దొరా? అని అడుగుతారు. ఈ విధంగా ప్రత్యేకం ఖర్చులేకుండా చేసుకొని తంటాలు పడతారు. చిన్నరైతు తీసుకుంటే తనకున్న పొలంతో కలిపి

చేసుకొని గడ్డికి మాత్రమే ఆశపడతాడు.

రైతుల సంగతే ఇలావుంటే ఇక కూలీల స్థితి ఎలావుందో వూహించుకో. కూలీవున్న రోజుల్లో రోజుకి మగవాడికి ౦-౪-౦ ఆడదానికి ౦-3-౦ వుంటుంది. ఎప్పుడూ ఆడదానికి మగవాడి కంటే ౦-౧-౦ తక్కువుంటుంది. ఈ కాస్త కూలిలో కూడా ఒక కిటుకుంది. ధాన్యంధర ఎక్కువగావున్న రోజుల్లో, రైతు డబ్బు రూపంలో కూలిస్తానంటాడు. ధర తక్కువగావున్న రోజుల్లో ధాన్యంరూపంలో కూలిస్తానంటాడు. ఈ కూలయినా డిసెంబరు నుంచి జులైవరకే దొరుకుతుంది. తర్వాత కొత్తాపాతా సందులో కూలి దొరకటమే కష్టం. ఆ రోజుల్లోనే వర్షాలెక్కువ. రోగాలెక్కువ.

రోగాలంటే జ్ఞాపకం వచ్చింది. బోర్డువారు మనవూళ్లో ఒక ఆస్పత్రి పెట్టారు. కాని మందులు కంట్రాక్టుమీద తెప్పించారనీ కొన్ని సీసాలలో మందులకు బదులు రంగునీళ్లున్నాయనీ గోలగా వుంది. మనవూళ్లో డాక్టరుకి అస్పత్రి ప్రాక్టీసుకంటే ప్రయివేటు ప్రాక్టీసే ఎక్కువగా వుంది.

కూలీల సంగతి వ్రాస్తూవుంటే ఎర్ర సుబ్బడి కూతురు జ్ఞాపకం వచ్చింది. ఎర్ర సుబ్బడు మీ పెద్దపాలేరు—జ్ఞాపకం వుందా? ఈమధ్య నేను పొలం వెల్తుంటే వాడి కూతురు చింతచిగురు కోసుకుంటూ ఈవిధంగా పాడుతూవుంది:—

"మారాజ యినవయ్య మాగాణి నాటేటి
మానవులకుండేటి చింతా—
అక్కామ సుబ్బామ, ఆయనకు పోవద్దు
తక్కువగ కొలబుట్ట తలగొట్టి కొలిచాడు

మారాజ యినవయ్య మాగాణి నాకేటి
మానవులకుండేటి చింతా—
మండూరి సంసారి మనకొరకు వచ్చాడు
నిండుగా కొలబుట్ట నిలబెట్టి కొలిచాడు
మారాజ యినవయ్య మాగాణి నాకేటి
మానవులకుండేటి చింతా—
అక్కామ సుబ్బామ ఆయనకు పోవొద్దు
తక్కువగ కొలబుట్ట తలగొట్టి కొలిచాడు—"

ఇంతవరకు పాడి నన్ను చూసి సిగ్గుపడి ఆపేసింది. కాని ఈ నాలుగు చరణాలే చాలు వాళ్ల ఆరాటం గ్రహించటానికి.

ఇప్పటికే చాలా రాశాను. మా కష్టాల్తో నిన్ను కూడా బాధ పెట్టాను. ఇవ్వాళకి ఇంతటితో ముగిస్తాను. ఇవ్వాళ రాత్రి బుడమేరు కాపలా మన వీధి వంతు పడింది.

ఇట్లు
**కోటేశ్వర్రావు**

## iv

గున్నేరు
౩౦-౧౧-౧౯౪౧.

గోపీ,

నిన్న వొక విషయం జరిగింది. అప్పటినుంచీ మనస్సేమీ సరిగ్గా లేదు. ఏం చెయ్యాలో తోచదు. ఏమీ చెయ్యకుండా పరిస్థితులకు తలవొగ్గి వూరుకో బుద్ధిపుట్టదు. అందుకని నీతో చెప్పుకుంటేనన్నా భారం తగ్గుతుందేమో అనే వుద్దేశంతో రాస్తున్నాను.

మా పినతల్లిని నువ్వెరుగుదువుగా. మనకు పెట్టవలసి వస్తుందని నానా అబద్ధాలూ ఆడి తన కొడుకుని తీసుకొనివెళ్లి చాటుగా సున్నివుండలు పెట్టుకుంటూ వుండేది. వాడెప్పుడైనా మనకు పెడితే వాణ్ణి చావబాదేది. ఆబిడ నిన్న పొద్దున్న మా ఇంటికొచ్చి, "ఒరే అబ్బాయి, అమ్మాయి మొగుడొచ్చాడ్రా, ఎంత చూచినా ఆ కూరగాయల అబ్బి యింకారాలేదు. ఇంట్లో మీ బాబాయిలేడు. నాలుగు బెండకాయలు పెట్టించరా?" అని అడిగింది.

నేనేదో పనిలో వుండి "దాన్నడగవే!" అన్నాను. ఆబిడ లోపలకువెళ్ళి ఏమడిగిందో ఏమో మా ఆబిడ మాత్రం ఇలా అంటం వినిపించింది-"అయ్యో అత్తా, నిన్న అడిగితే ఇచ్చేదాన్ని. నాలుగు కాయలుంటే మీ అబ్బాయికి వండిపెట్టాను" అని.

"లెక్క- రెండు కాయలియ్యవే!" అని అడిగింది.

"లేవత్తా! వుంటే నీదగ్గర దాపరికమా?" అంది మా ఆబిడ.

మా పిన్ని చిన్నమొహం చేసుకొని వెళ్ళిపోయింది. నా మనస్సు చివుక్కుమంది. కూరలు కొనలేక వాములదొడ్లో బెండమొక్కలూ పొట్లపాదులూ పెట్టించాను. మాపాలేరు అంతకుముందే కోసుకొచ్చి బెండకాయలు ఇచ్చి పోవటం చూశాను. ఏమనుకోవాలి?

వెంటనే ఇంట్లోకి వెళ్ళి ఇరుగూ పొరుగూ అనేదిలేకుండా చేసుకుంటున్నావు అని కేకలు వేశాను. మా ఆబిడకు కోపం వచ్చింది. ఏమన్నదో చూశావా? "ఆడవాళ్ల సంగతులు మీకేం తెలుస్తయి? మొన్నటికి మొన్న రెండు కరివేప మండలు పెట్టమని అడిగితే ఈ మీ పిన్ని ఏమందో తెలుసా?– అప్పుడే రెబ్బలు విరిస్తే చిన్నమొక్క బతికేదెట్లాగమ్మా! అందులో వూళ్ళోవాళ్లంతా దానికే ఎగబాకుతారు—లేదంటే కోపాలు, అని మాతులూ ముక్కులూ విరిచింది. బెండకాయలు రమ్మంటే వూరికే వస్తాయా ఏమిటి? నేనేం పోగోసుకూర్చున్నానా?" అంది.

నిజంగా, గోపీ, మన తాతల కైముకీ ఇప్పటికీ ఎంత తేడా వుంది? అప్పుడు పల్లెటూళ్ళల్లో ఒకళ్ళకొకళ్లు, ఎంత సహాయ పడుతుండేవాళ్ళు. ఇతర వృత్తుల్లో వున్నవాళ్లకి రైతులెంత సహాయం చేస్తుండేవారు. ఇప్పుడో! ఇప్పుడు సహాయం మాట అటుంచి ఒక్క మజ్జిగ చుక్క కూడా దొరకటం లేదు. చిప్వరికి కూలి వాళ్లకూడా, గేదెకింత తవుడిస్తేనే పోస్తున్నారుగాని వూరికే పొయ్యటంలేదు.

ఇక్కడ ప్రయివేటు చెప్పుకుంటూన్న మాష్టరికి మొన్న జబ్బు చేసింది. వైద్యుడు దానిమ్మకాయలు తినమని సలహా

చెప్పాను. పాపం, వూళ్లో ఎక్కడా దానిమ్మకాయే దొరకలేదు. ఒక్క షావుకారు బ్రహ్మయ్య ఇంట్లోనే చెట్టుందని తెలిసింది. దానిమీద క్రిష్ణయ్య వెళ్లి అడిగితే అతడు ఇవ్వనంటే యివ్వ నన్నాడు—'మా అల్లుడికి పంపుకోవాలి, ఇవ్వటానికి వీల్లేదు,' అని కచ్చితంగా చెప్పాడు. ఏం చెయ్యాలి? ఎంత బతిమాలినా వినలేదు. చేసేది లేక క్రిష్ణయ్య ఊనికి వెళ్లి కొనుక్కురావటా నికి తయారయ్యాడు. అప్పుడు బ్రహ్మయ్య, "పోనీలేరా అబ్బాయీ, నువ్వింత చెబుతున్నావు గనక బజార్లో ఇచ్చే ధరకి ఇక్కడే తీసుకో," అని చెప్పి అర్ధరూపాయికి మూడు కాయలిచ్చాడు.

ఇంత మొండితనం, స్వార్థపరత్వం పల్లెటూరి ప్రజల హృద యాల్లోకి ఎలా ఎక్కాయో నాకు తెలియటంలేదు. ఆ సంఘీ భావం ఏమయిందో, ఆ పరస్పర ప్రేమ ఏమయిందో, ఆ కట్టు బాట్లు ఏమయ్యాయో!

మొన్న క్రిష్ణయ్య చెరువుగట్టుమీద కూర్చుని వుంటే, ఈ సంగతే అడిగాను. అతడేదో చెప్పటం మొదలు పెట్టేటప్పటికి, వెంకయ్య కూడా వచ్చి కూర్చున్నాడు. అప్పుడు మేం మాట్లాడు కున్న విషయం రాస్తాను. నీ అభిప్రాయం కూడా తెలుసు కుందామని ఈ సంగతి రాస్తున్నాను.

"ఈ మార్పులన్నీ ఆర్థికపరిస్థితుల్ని బట్టే వొస్తున్నాయి. సహజంగా రావలసిన మార్పులే," అన్నాడు క్రిష్ణయ్య.

"అంటే?" అని ప్రశ్నించాడు వెంకయ్య.

"సంఘంలో, డబ్బులేక పోవటంవల్ల వచ్చే బాధలు ఎక్కు వైనై. దానివల్ల ప్రజలు ఎవ్వరికివారు డబ్బు విలువను గ్రహించి

జాగ్రత్తపడుతున్నారు. ఒక నాగరికతను దాటి మరో నాగరికతలో పడే సంధియుగంలో, ఈ బాధలూ తాపత్రయాలూ తప్పవు. వీటినిచూచి బెదిరి పూర్వయుగాన్ని ఈసంధి యుగంతో పోల్చుకొని విమర్శించటం చాలా అవివేకం—"అన్నాడు క్రిష్ణయ్య.

"నిజమే. అంతవరకు నేనూ వొప్పుకుంటాను. కాని నువ్వు చెప్పినట్లు ఆర్థిక పరిస్థితే దీనికి కారణమైతే చేతి పరిశ్రమలను వృద్ధిచేసుకొని చక్క-బెట్టుకో గూడదూ?" అని అడిగాడు వెంకయ్య.

చేతి పరిశ్రమలు అనగానే క్రిష్ణయ్య నవ్వాడు. "చక్క-బెట్టుకున్నాంగా...రాటాలు పెట్టాం, మగ్గాలు పెట్టాం, ఇప్పుడవన్నీ ఏమయినయ్?" అన్నాడు.

"మనలాంటివాళ్ళుండబట్టి ప్రోత్సాహం లేక మూలపడినయ్," అన్నాడు వెంకయ్య.

వెంటనే క్రిష్ణయ్య అందుకున్నాడు—"ప్రోత్సాహం రమ్మంటే ఎలా వస్తుంది? దానివల్ల ప్రజలకు ప్రయోజనం వుండి, ఆచరణలో పెట్టటానికి వీలయ్యిందైతే ప్రోత్సాహం దానంతటదే వొస్తుంది. కానప్పుడు, ఉద్రేకంలో కొంత ఫలితం కలిగినా చిరకాలం బతకవు.

నెలపొడుగునా రోజుకి నాలుగు గంటలు రాటం వొడికితే ఎంత లాభంవస్తుందో తెలుసా? షుమారు రూపాయి వొస్తుంది. ఇది కృషికి తగ్గ ఫలితమేనా? ఈ లాభంకోసం నరాలు తెంచుకోమంటే ప్రజలు వింటారా? ఇది తీరికసమయాల్లో తెచ్చుకునే సంపాదనే గనక ఎంతొచ్చినా ఫరవాలేదంటారు నీలాంటివాళ్లు. అస్తమానం ఒక పనిలోవుండి తీరిక సమయాల్లో మరో

పనిచెయ్యటం సాధ్యమేనా? తీరిక నేది లేకుండా పనిచేస్తే ప్రజ ఏమైపోతుందో నువ్వెప్పుడైనా ఆలోచించావా ?

పోనీ ఆ గుడ్డ కొనుక్కుందామంటే అదే రకం, నాణ్యం కలిగిన మిల్లుబట్టలు చౌక్కా వస్తున్నాయాయెను. ఇక ఈ బట్ట మార్కెట్టులో ఎలా పోటీ చేస్తుంది? మారిపోతున్న రుచులకు అనుగుణంగా ఈ బట్టను తయారు చెయ్యటం కూడా కష్టమే అయిపోయె. వూరికే అందని దానికోసం వూపిరి బిగబట్టమంటే ఎన్నాళ్లు వింటుంది జనం?"

క్రిష్ణయ్య ఇలా మాట్లాడేటప్పటికి వెంకయ్యకు కోపం వచ్చింది. వెంకయ్య సంగతి నాకు తెలుసు. ముక్కోపి. ఎదటివాని భావాన్ని సహించలేని దుర్బలుడు. అందుకని రసాభాసం అవుతుందేమోనని భయంవేసి సర్దటానికి క్రిష్ణయ్యను ఈవిధంగా ప్రశ్నించాను. "దానివల్ల ప్రయోజనం లేదు, దీనివల్ల ప్రయోజనం లేదు, అంటూ ప్రతిదాన్నీ విమర్శిస్తూ కూర్చుంటే ఏం లాభం? దేనివల్ల ప్రయోజనమో, పల్లెటూళ్లు బాగుపడాలంటే ఏం చెయ్యాలో చెప్పు."

"చెబుతాను" అని మొదలుపెట్టాడు క్రిష్ణయ్య. "మనం భూమి మీద రైతు వొత్తిడి తగ్గించాలి. వ్యవసాయంమీదే ఆధారపడ్డ జనాన్ని కొంతమందిని పరిశ్రమల్లో ప్రవేశపెట్టాలి. పరిశ్రమల వల్ల కొంత అపాయం వుందని భయపడి, దానివల్ల వచ్చే లాభాలను వొదులుకొని వెనక్కి వెళ్లటం మానవజాతికి శ్రేయస్కరం కాదు. పరిశ్రమలను తెచ్చుకో. దానిలో చెడును నిర్మూలించటానికి ప్రయత్నించు. కొంతమందిని పరిశ్రమల్లో జేర్చి పల్లెటూళ్లకీ పట్టణాలకీ ఎక్కువసంబంధం కలిగించి పల్లెప్రజల్లో ఉన్నత

భావాలు మొలకలెత్తేటట్టు చెయ్యి. అంతేగాని పల్లెటూర్ని మిగిలిన భూభాగంతో సంబంధం లేని ఒక ఖండంగా తయారు చేశావంటే పల్లెటూళ్లు కుమిలిపోతయ్."

సాధారణంగా క్రిష్ణయ్య ఎప్పుడూ ఇట్లాగే మాట్లాడుతూ వుంటాడు. నీవు ఏమనుకుంటావోగాని, ఆలోచించినకొద్దీ క్రిష్ణయ్య చెప్పేదాంట్లో సత్యం లేకపోలేదు అనిపిస్తుంది నాకు.

మరొకచిత్రం. వొట్టప్పుడు పల్లె ప్రజలు డబ్బంటే ఇంత జాగ్రత్తగా వుంటారా— డబ్బుకోసం మొహమాటాలుకూడా లెక్కచెయ్యరా - డబ్బుకోసం రైటింగికూడా సిద్ధపడతారా- ఇల్లూ పెళ్ళీ అనేటప్పటికి ఎక్కడలేని శివం ఎక్కుతుంది. ఎంత ఖర్చుపెట్టడానికైనా వెనుదీయరు. ఎక్కువ ఖర్చుపెట్టకపోవటం అవమానం కూడాను.

మన షావుకారు బ్రహ్మయ్య ఏభైవేలు ఖర్చుపెట్టి ఒక మేడ కట్టించాడు. పిల్లికి బిచ్చంపెట్టని అతనికి ఇల్లనేటప్పటికి శివం ఎత్తింది. పోనీ ఇంత ఖర్చుపెట్టి కట్టించాడా, కట్టించి ఏం చేశాడనుకున్నావు? ముందు వసారాలో ధాన్యపు బస్తాల దొంతర్లు పెట్టించాడు. ముందు రెండు గదులూ ధాన్యపు కొట్లుగా మార్పించాడు. మధ్యహాల్లో ఉయ్యాలబల్ల వేయించి, దానిమీద పరుపు దొంతర్లూ గోనె సంచులూ పెట్టించాడు. ఎప్పుడూ మేడమీదికి ఎక్కనేఎక్కడు. అసలు ఉపయోగించటమే లేదు. మరచిపోయాను. అప్పుడప్పుడూ పెసలూ మినుములూ మిరపకాయలూ ఎండబోయిస్తూ వుంటాడు పైడాబా మీద. మరొక చిత్రం ఏమిటంటే ఇంట్లో ఖాలీ లేనట్లు ఎప్పుడూ ఇంటిముందే పొగాకు చుట్టుకుంటూ కూర్చుంటాడు.

దీనికింత ఖర్చెందుకు? ఇతర విషయాల్లో ఇంత పిసిని గొట్టుగా వుండే బ్రహ్మయ్య ఇల్లనేటప్పటికి ఇంతెందుకు ఖర్చు పెట్టాడు? ఏమో, ఎంత ఆలోచించినా ఈ ప్రశ్నలకు సమాధానం దొరకటంలేదు. నువ్వేమన్నా చెబుతావేమోనని ఆశ.

ఇక వుండనా?

ఇట్లు
కోటేశ్వర్రావు

## V

గున్నేరు

౧౮-౧౨-౧౯౪౧.

గోపీ,

నీ ఉత్తరం అందింది. పల్లెటూళ్ళనుగురించి నేను రాసిన సంగతులు, చాలా విడ్డూరంగా వున్నాయి, అని రాశావు. వుండొచ్చు. పల్లెటూరి జీవితాన్నిగురించి పొగట్టం మనకు అలవాటైపోయిందేమో! నేనుమాత్రం ప్రత్యక్షం చూస్తూ, అనుభవిస్తూవున్న విషయాలనుగురించే నీకు రాశాను- రాస్తున్నాను. యదార్థాన్ని తెలుసుకొని, లోటుపాట్లను సర్దుకోటానికి ప్రయత్నిస్తే లాభం కలుగుతుందిగాని, మన్ని మనం మోసం చేసుకోవటంవల్ల లాభంలేదు. సంఘం ఒక్క అడుక్కూడా ముందుకు జరగదు. “ఎక్కడున్నావే సంఘం?” అంటే “వేసిన చోటే వున్నాను,” అంటుంది.

మన పల్లెటూరు జీవితాన్ని పొగట్టానికి క్రిష్ణయ్య మరొక కారణం కూడా చెబుతాడు. ‘మనది ఆధ్యాత్మిక నాగరికతనీ పాశ్చాత్యులది భౌతికమనీ, దీనికంటే అది చాలా గొప్పదనీ, మన ఉద్దేశం. అందుకని పాశ్చాత్య నాగరికతకు విరుద్ధంగా వుండే ఆచారమర్యాదల్ని పొగుడుకొని సంతోషిస్తున్నాం. పరిశ్రమలను వృద్ధిపొందించుకోలేక, పరిశ్రమల్లేని యుగాన్ని పొగుడుతున్నాం,’ అంటాడు.

ఏదెలాగయినా పల్లెటూళ్ళస్థితి, ఇప్పుడు ఏమీ బాగాలేదనే విషయం మాత్రం ఎవ్వరూ కాదనలేరు.

ఇంకా మా సంగతి కొంచం నయం. ఇక్కడేపుట్టి, ఇక్కడే పెరిగినవాళ్ళం అవటంవల్ల ఏదో ఒక విధంగా సర్దుకుపోగలుగు తున్నాం. పట్టణాల్లోవుండి, చదువు పూర్తిచేసుకునో, మాని వేసో వచ్చి, పల్లెటూళ్ళలో కాలం గడిపే విద్యార్థుల్ని చూస్తే గుండె తరుక్కు పోతుంది.

మొన్నటిదాకా పట్టణాల్లో వుంటంవల్ల, వాళ్ల అభిప్రాయాలూ, రుచులూ, అలవాట్లూ, ఆలోచనలూ - అన్నీ మారి పోయినై. ఖర్చేమో విపరీతంగా పెరిగిపోయింది. స్నేహాలూ, రాకపోకలూ ఎక్కువైనై. ఉద్యోగాల్లేవు. మళ్ళీ భూమిమీదే ఆధారపడవలసి వస్తూ వుంది. ఊళ్లో వుంటానికి వీల్లేక, ఇటు పల్లెటూళ్లో వుండలేక ఉక్కిరిబిక్కిరై పోతున్నారు.

ఉద్యోగం చెయ్యని - వ్యవసాయం చెయ్యలేని - వీళ్ళని చూస్తే, పైగా వూరి వాళ్ళందరికీ లోకువ. సాధారణ రైతుల్లాగా తమ పనులన్నీ తాము చేసుకోరని ఈసడింపు.

'చదువుకి ఇంత డబ్బు తగలేశాడా, సుబ్బయ్య కొడుకు, ఇప్పుడేం చేస్తున్నాడో చూశావా?' అంటారొకరు.

'గొడ్ల కాస్తున్నాడు,' అంటారు మరొకరు.

'అందుకు ఈళ్లెందుకు పనికివస్తార్రా? గేదెని కట్టెయ్యటం చేతగాదు,' అంటారు ?

'నిజమే! చదువుకున్నాడికంటే చాకలివాడే మేలు,' అని తీర్మానం చేసుకుంటారు.

ఈ మాటలన్నీ ఆనోటా ఆనోటా పడి అసలువాడికి తెలుస్తూనే వుంటై. కాని ఏంచేస్తాడు ? వీళ్ళదైనా తప్పని చెప్పలేం. కుర్రవాళ్లేదో చదువుకొని ఉద్ధరిస్తారని పెద్ద లనుకుంటూ వుంటే

ఏదీ లేక చేతులు ముడుచు కూర్చునేప్పటికి లోకువ కాక ఏమవుతుంది ? ఒకళ్ళ నొకళ్ళు అర్థంచేసుకునే ప్రయత్నమే చెయ్యరు - చెయ్యటానికి ఇప్పుడున్న పరిస్థితుల్లో అంత తేలికైన విషయం కూడా కాదనుకుంటాను.

మొన్న క్రిష్ణయ్యా అతని తండ్రీ పోట్లాడుకున్నారు. సంవత్సరంనుంచీ కూడా వాళ్ల సంగతి అతుకతుగ్గానే వుంది. మొన్న పూర్తిగా తెంచేసుకున్నాడు. క్రిష్ణయ్యని ఇంత తిని ఇంటిపట్టున వుండమంటాడు తండ్రి. క్రిష్ణయ్య అందుకు వొప్పుకోడు. వూళ్ళో పనులన్నీ నెత్తిన వేసుకొని, చేతులు కాల్చుకోకు అంటాడు తండ్రి. క్రిష్ణయ్య వినడు.

'ఉంటే నేచెప్పినట్లు వుండు. లేకపోతే నాయింట్లో నుంచి నడు. నీచదువుకోసం నా ఇల్లంతా గుల్లచేసుకున్నాను,' అని కేకలు వేశాడు అతని తండ్రి.

అప్పటినుంచీ క్రిష్ణయ్య, ఇంటికి వెళ్లటం మాని వేశాడు. మేమెంత చెప్పినా, మా మాటలు కూడా వింటంలేదు—మీకు తెలియదు, లాభంలేదు, అంటాడు.

ఎక్కడ చూచినా ఇట్లాంటి మనస్పర్థలే కనుపిస్తున్నాయి. ఆచారవ్యవహారాల్లో దృక్పథంలో, నమ్మకాల్లో, అన్నిట్లో వ్యత్యాసాలే. క్రిష్ణయ్య, 'అర్థిక విధానం మారాలి. కాస్తకష్టంలోనే తనకు సరిపోయే సంపాదన చేసుకునే అవకాశం మానవుడికి కలగాలి. అప్పటివరకూ ఈ గలాటా తప్పదు,' అంటాడు.

వెంకయ్య ఈ మాటలు విని, 'మాట మాట్లాడితే ప్రతిదీ ఆర్థికస్థితికి ముడిపెడతావ్? మన షాహుకారు బ్రహ్మయ్య, ఆర్థికంగా చాలా బాగుపడ్డమని షేగడా. అతని బుద్ధులు మారవే!'

అన్నాడు.

'అందుకనే విధానం మారాలంటున్నాను. ఎక్కడో ఒక వ్యక్తి నాలుగుడబ్బులు పోగుజేసినా అప్పటి విధానానికి లోబడి వుండేవాడే గనక ఆ ఆచారాలనూ నాగరికతనూ దాటిపోడు. కనక షావుకారు బ్రహ్మయ్య డబ్బు సంపాదించినా ఇప్పటి సంఘమర్యాదలను అతిక్రమించడు. అతిక్రమించక ఆ విధానాన్ని బాగా జీర్ణించుకొని, దానికి దాసానదాసుడై, ఇతర్లకంటే ఆ విధానంలోని చెడును బాగా ఉపయోగించుకోగలుగుతున్నాడు కాబట్టే, మిగిలిన వాళ్ళకంటే ఎక్కువ డబ్బు సంపాదించగలిగాడు,' అని జవాబు చెప్పాడు క్రిష్ణయ్య.

మాపరిస్థితులు చెప్పి చెప్పి నీకు విసుగు పుట్టించి వుంటాను. మాబాధల్ని అర్థంచేసుకొని, సలహా ఇవ్వగలవాళ్లకి చెప్పుకోటం మంచిదనే ఉద్దేశంతో ఇంత విపులంగా రాస్తున్నాను. మా పరిస్థితి ఇలావుంటే చూచి బాగుచెయ్యాలని ప్రయత్నించేవాళ్లు లేకపోలేదు. కాని వాళ్లు 'ఈ పద్ధతి మంచి'దంటే 'ఈ పద్ధతి మంచిది' అని తగాదాలాడుకొని ఏ పద్ధతీ ఆచరణలో పెట్టకుండా వూరుకుంటున్నారు.

యుద్ధాన్ని గురించి ఏమనుకుంటున్నారో రాయమని అడిగావుగదా, చెబుతాను—

మొదట్లో యుద్ధం సంగతి ప్రజలు అట్టే పట్టించుకోలేదు. తరువాత ధరలు పెరుగుతాయని సంతోషించారు. కాని క్రమేపీ యుద్ధం ప్రపంచాన్నంతా ఆవరించేటప్పటికి చలనం బయల్దేరింది. రష్యా విజయాలను, చాలా ఆతురతగా వింటున్నారు. ఇక కొద్దిరోజుల్లోనే హిట్లర్ పతనం తప్పదు అనుకుం

టున్నారు.

అమెరికా, ఇంగ్లండులమీద జపాన్ యుద్ధం ప్రకటించినప్పటినుంచీ మరీ ఆవేశం పెరిగిపోతూవుంది. విచిత్రం ఏమిటంటే, ప్రజలకు మిగిలిన శత్రుదేశాలమీద కంటే జపాన్‌మీదే ఎక్కువ కోపంగావుంది. యుద్ధం ప్రకటించకముందు, 'తూర్పు దేశం' అనే అభిమానం ప్రజలకు ఏమన్నా వుంటుందేమోనని క్రిష్ణయ్య అనుమానించాడు. అలాంటిదేమీ కలక్కపోవటం చాలా సంతోషం. ప్రజలు యుద్ధంసంగతి తెలుసుకోటానికి చాలా కుతూహలం చూపుతున్నారు. మొట్టమొదట జపాను చేసిన హడావుడికి కొంత ఆశ్చర్యపడ్డారుగాని, దరిమిలాని, అమెరికా, ఇంగ్లండుల ప్రతిఘటన చూచి సంతోషిస్తున్నారు.

కొందరు, "జపాన్‌లో ఇళ్లెక్కువ కొయ్యతోనూ, కాగితాలతోనూ, చెయ్యబడ్డవని అంటున్నారుగదా, శత్రువులు వేసే బాంబుల్ని ఏం తట్టుకుంటుంది ?" అని ప్రశిస్తున్నారు.

ఈవిధంగా, రాత్రి భోజనాల వేళయ్యేవరకూ కాలం జరిగిపోతూవుంది. ఈ ఉత్సాహాన్నంతా సక్రమ మార్గాల్లో పెట్టిస్తే, ఈ ప్రజాశక్తి ఏ శత్రువునైనా ఓడించగలదు అనిపిస్తూంది నాకు.

పెళ్లిళ్లకు ఇంకా ఇదివరలాగా డబ్బు ఖర్చుపెడుతూనే వున్నారా? అని అడిగావు. ఆఁ. ఖర్చేమీ తగ్గలేదు. ఆ మేళతాళాలూ, కోలాహలం, భోజనపు పంక్తులూ— అన్నీ జరుగుతూనే వున్నాయి. ఖర్చు తగ్గించుకోమని ఎవరన్నా సలహా చెబితే ఆడవాళ్లు, అచ్చటా, ముచ్చటా తీరదు అని గోల చేస్తారు.

ఈ మధ్య మన బంధువుల్లో ఒక వివాహం జరిగింది. దానికి

పూరబంతి పెట్టి పిలిచారు. ఒక్క పూరేకాదు. చుట్టు పక్కలవున్న రెండుమూడు వూళ్ళవాళ్ళనీ, పట్టణాన్నుంచి పెద్దమనుషుల్నీ పిలిచారు. పెండ్లికొడుకు తరఫువారు కూడా చాలా ఎక్కువమంది వచ్చారు. వీరందరికీ భోజనాల ఏర్పాటు చేసేటప్పటికి తల ప్రాణం తోకకొచ్చింది. ఇల్లు చాలక కొన్ని పంక్తులు దంపుళ్ళవసారాలో వేయించారు. మా మేనమామని ఎరుగుదువుగదా. అతడు భోజనప్రియుడు. పంక్తుల్లో అంతా ముగించుక్కూచుంటే ధప్పళం జుర్రుతుండేవాడు. ఆయనా నేనూ కలిసి భోజనానికి వెళ్ళాం. మొదటి పంక్తిలో చోటు లేక దిగబడ్డాం. రెండోపంక్తిలోకూడా చోటుండదేమో అనే భయంతో మొదటిపంక్తి వాళ్ళు చేతులు కడుక్కోటానికి వచ్చేసమయం లోనే ఆయన లోపలకి దూరబట్టానికి ప్రయత్నించాడు. ఎవరో అమాంతంగా వెనక్కి నెట్టేటప్పటికి మెట్లమీద దొర్లి దభేలున పడ్డాడు. మోకాళ్ళూ మోచేతులూ కొట్టుకుపోయినై. ఇక ఏమనుకుంటే ఏంలాభం?

నాకుమాత్రం చాలా కష్టంవేసింది. ఇంతమందిని పిలవటం ఎందుకు? ఇంత కస్మాలం చెయ్యటం ఎందుకు? తగుమాత్రం మందిని పిలిచి శుభ్రంగా చేసుకోగూడదూ?

మొన్న క్రిష్ణయ్య ఒకపెళ్ళి చేయించాడు. ఏబాదరబందీ లేకుండా చేసి ముఖ్యమైన కార్యకలాపం పది నిమిషాల్లో పూర్తిచేసాడు. ఆ పెళ్ళికి మొత్తం ఖర్చు పది రూపాయిలయింది. హాయిగా పూర్తయింది. కుర్రవాళ్ళూ, పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూ సంతోషించారు గాని మిగిలినవాళ్ళు చప్పరించారు. అమ్మలక్కలు, 'ఇదేం సోద్యం?' అని బుగ్గన వేలు పెట్టు

కున్నారు. కుఱ్ఱవాళ్ళకి నచ్చటంవల్ల త్వరలోనే ఈ పద్ధతి వ్యాపకంలోకి వస్తుందని క్రిష్ణయ్య సంతోషిస్తున్నాడు. అదేదో త్వరగా జరిగితే బాగుండును అనుకుంటున్నాను. దురవ్య యమూ ఉండదు. ప్రాణానికి సుఖమూ వుంది. ఏ కలతలూ లేకుండా పెళ్లికి వచ్చిన జీవాలు ఇళ్లకు జేరతై.

పాపం సుబ్బయ్యగారి మూడోకొడుకు నిన్న బజారుతల నున్న బావిలో పడ్డాడు. బజార్నే పోతున్న రాముడు చూడక పోతే ఏమైపోయేవాడో! ఎలెక్షన్లకనీ, పీటికనీ, వాటికనీ అన వసరంగా డబ్బు ఖర్చుపెట్టే ఆసాములు, ఖర్చుపెడుతూనే వుంటారు. వూరు కొంచం బాగుచేద్దామంటే మాత్రం చెయ్యి ఆడదు. మనవూళ్లోవాళ్లంతా ఆ బావి నీళ్లే వాడతారు. ఊరి కంతకీ అదొక్కటే బావి. నీకు జ్ఞాపకం వుందనుకుంటాను. దానికి బొడ్డు కట్టించాలని క్రిష్ణయ్య చాలా ప్రయత్నించాడు. కాని ఇంతవరకూ పడలేదు. 'నిజమే, అపాయంగానే వుంది;' అంటారు గాని డబ్బు సంగతి వొచ్చేటప్పటికి మొహాలు తప్పి స్తారు—'ఆఁ, కర్మనెట్లుకొస్తే మనం చేసే దేముంది? చావు రాసి పెట్టివుంటే బావిలో పడే చావాలీ! బ్రహ్మ రాత తప్పు తుందీ!' అని వేదాంతం మాట్లాడుతారు. ఇప్పటికివీ సంగతులు. ఇక సెలవు తీసుకుంటాను.

ఇట్లు
కోటేశ్వర్రావు

# vi

గున్నేరు
౨—౮—౪౨.

గోపీ,

మళ్లీ చాలా రోజులకు ఉత్తరం రాస్తున్నాను. నీ వుత్తరం అందింది. కాని, ప్రత్యేకం రాయవలసిన సంగతులు లేక అశ్రద్ధ చేశాను- పైగా, యుద్ధం హడావిడి ఒకటి. అసలు యుద్ధం సంగతి ఎలావున్నా, రకరకాలుగా ప్రచారంలోకి వొస్తున్న పుకారులతో అవస్త లెక్కువౌతున్నై. ‘అదిగోపులి’ అంటే, ‘ఇదుగో తోక’ అనే స్వభావం మంది. అందువల్ల లేనిపోని ప్రమాదాల్ని వూహించుకొని భయపడుతూవుంది ప్రజ.

ఎందుకలా భయపట్టం ? భయపట్టంవల్ల ఏం లాభం? అందు కనే కృష్ణయ్య మన చుట్టుపట్ట గ్రామాలలో యుద్ధాన్నిగురించి నిజమైన వార్తల్ని ప్రజలకు చెప్పటం, భయం పోగొట్టటం, గాలి కబుర్లు ప్రచారంలోకి రాకుండా చెయ్యడం పనిగా పెట్టు కున్నాడు. రోజూ సాయంకాలం జనాన్ని పోగుచేసి పుకార్లు పుట్టించడంవల్లా, ఆనోటా, ఆనోటా వచ్చే వదంతులను నమ్మటం వల్లా ఎంత అపకారం జరుగుతుందో తెలియజెపుతున్నాడు. “యుద్ధం రోజు రోజుకీ దగ్గరకు వస్తూన్నమాట నిజమే — కాని భయపడకుండా, శత్రువు దాడిచేస్తే మనం ఏం చెయ్యాలో అలోచించాలి,” అని చెబుతున్నాడు.

“మనం చేసేదేముంది? మనవల్ల ఏమవుతుంది?” అని పెదిమ విరిచాడు మాధవయ్య.

"అదే పిరికితనం! మనం చేయగల్గింది చాలావుంది. విమాన దాడులవల్ల, పట్టణాలలో వున్నవారు ఖాళీచేసి పల్లెలకువస్తారు. వాళ్లకు తగిన సదుపాయాలు చెయ్యాలి. బాంబుల్నించి ఎలా రక్షించుకోవాలో, ప్రజల్లో ప్రచారం చెయ్యాలి. శత్రువులు, మనల్ని మోసం చెయ్యటానికి చేసే ప్రచారాన్ని, ఎలా ఎదుర్కోవాలో నేర్పాలి. టౌన్‌లో బాంబుల రక్షణకు చేసే ప్రయత్నాలకు సహాయపడాలి," అన్నాడు క్రిష్ణయ్య.

ఈవిధంగా రోజూ రైతులకు చెప్పడంవల్ల మనవూళ్ళో ఎక్కువమంది ధైర్యంతో వున్నారంటే ఆశ్చర్యంలేదు. అనవసరంగా ఒకచోట పోగై యుద్ధాన్నిగురించి గాలికబుర్లు చెప్పుకోకుండా ఎవరిపనులు వాళ్ళు చేసుకుపోతున్నారు. తీరికసమయాల్లో ఇతరులకు సహాయపడుతున్నారు. క్రిష్ణయ్యలాటివాళ్లు ఊరికి నలుగురుంటే—శత్రువును చూచి భయపడటం మాట అటుంచి, జయప్రదంగా ఎదుర్కోగలమని కూడా అనిపిస్తుంది నాకు. నేనీ ఏడు పొలాలన్నీ బాగుచేయించాలని అనుకుంటున్నాను. యీసంవత్సరమే ఏం తొందరొచ్చిందీ, అని నీవనుకోవచ్చు. పది సంవత్సరాలనుంచి ధరలు సరిగా లేకపోవటంవల్లా—కలసి రాకపోవటంవల్లా—ఏపనీ చేయించలేకపోయాను. యిప్పటిదాకా, చేసిన అప్పులు తీర్చుకోవటంతోటే సరిపోయింది. గత రెండు సంవత్సరాలనుంచీ కొంచెం ధాన్యం ధర పలుకుతూ వుంది. యిప్పుడే అవసరం ఐన మరామత్తులన్నీ చేయించి, ఎరువు తోలిస్తే—మళ్ళీ ఇప్పట్లో పొలాలసంగతి చూడ నక్కరలేదు. అందుకని ఎరువు తోలించే ఏర్పాట్లు చేస్తున్నాను.

మాధవయ్య యీ సంవత్సరం బండీ ఎడ్లను అమ్మేశాడు.

ఒళ్లు విరుచుకోటంకంటే వ్యవసాయం చేయించుకోవటంవల్ల మరేమీ లాభంలేదు. కౌలుకిచ్చి చేలు పాడవకుండా దగ్గరుండి వ్యవసాయం చేయించుకుంటేనే లాభం అంటున్నాడు. యింతే కాదు! గడ్డి ఖరీదుకట్టి, పాలేరు జీతం లెక్కవేసి గేదెను మేపిం దానికంటే—నెయ్యీ పెరుగూ కొనుక్కోడమే మేలని గేదెని అమ్మేశాడు.

సినిమానిగురించి మనవాళ్ళ వుద్దేశాలు నీకు తెలియపరచాలనీ, నీ వుద్దేశాలు తెలుసుకోవాలనీ, చాలారోజులనుంచి అనుకుంటూ అడగడం మరచే పోతున్నాను. మే మీమధ్య చాలా సినిమాలు చూచాం. అందులో మొదటిది "రైతు జీవితం." చాలా స్వభావసిద్ధంగావుంది చిత్రం. రెండోది "రేపల్లెవాడ." మరొకటి "సవతిపోరు."

యీ చిత్రాలన్నీ నాకు స్వభావసిద్ధంగా వుండి, ఏమాత్రం లేనిపోని కల్పనలూ ఉత్ప్రేక్షలూ లేకుండా చాలా బాగున్నాయి. కాని మన వాళ్లకు మాత్రం నచ్చలేదు—— "ఈ ఎద్దులూ, యీ పంటలూ, యీ ఆవులూ, యీ కజ్జాలూ రోజూ చూచేవేగా? యిందుకేనా మనం డబ్బు దండగ పెట్టింది?" అన్నారు.

ఈ దృష్టి నాకు ఆశ్చర్యం కలిగించింది.

సాధారణరైతుది అంతగా వుత్సాహంలేని జీవితం అవటం వల్ల అప్పుడప్పుడూ సినిమాలద్వారా తన కందుబాటులో లేని దృశ్యాలని చూసి సంతోషిస్తాడనుకుంటాను. కనక, మామూలు సమస్యలైనా లగువు బిగువులతో చిత్రంగా వర్ణించి చూపితే- సంతోషిస్తూనే వుంటాడు.

రైతు—తనకు తీరని కోర్కెల్ని కథానాయకుడు నెరవేర్చుస్తూవుంటే తన్మయత్వం చెందుతాడు. తానే ఆపనులన్నీ చేస్తూన్నట్లు తృప్తిపడతాడు. కథానాయకుడు గోడ దూకితే - తాను యీలవేస్తాడు. కథానాయకుడు మబ్బుల్లోకి కారు వేసుకుని రంయిన పోతూంటే - తాను చప్పట్లు కొడతాడు. నాయకుడూ, నాయకీ, విపరీతమైన కష్టాలుపడి చివరకు కలుసుకుంటే - వొఖ్ఖ నిట్టూర్పు విడుస్తాడు. కథానాయకుడు ప్రతినాయకుణ్ణి తంతూంటే మోకాళ్లమీద లేచి వన్సుమోర్ కొడతాడు.

ఇంతే కాని అందులోవుండే అవకతవకల్ని చూడడు. ఇది ఒక్క రైతు స్వభావమే కాదు. మానవ స్వభావమే ఇంత అనుకుంటాను. పట్టణ జీవితాని కలవాటుపడ్డ నీవే వున్నావనుకో! నీకు పల్లెజీవితమంటే ఎంత యిష్టం! ఆ ప్రశాంత జీవనం, ఆ పచ్చని చేలూ, చేలకు పక్క పంటకాలవా, ఆ చెరువూ, ఆచెరువులోని కలవలూ, తామరాకులూ, తామరాకులమీది మంచుబొట్లూ—అంటావుకాని నిత్యమూ యిక్కడే వుండే మాకవి కనిపించవు. ఎలాకనిపిస్తయ్? నీకు తెలియని అవసారాల్లో, కనిపించని పరిస్థితుల్లో నలిగి కుంగిపోయే మాకు ఇవేం ఆనందాన్నియ్యగలవు!

ఈమధ్య నే నోవ్యాసం చదివాను. అందులో ఆవ్యాసకర్త తోలుబొమ్మల్లో — భాగోతాల్లో పెద్దకళవుందని పొగిడాడు. అప్పుడప్పుడూ కొందరు ప్రముఖులు ఇలా మాట్లాట్టం కూడా వినే వున్నాను. వీటికి ఆటపట్టయిన పల్లెటూళ్ళల్లో మాత్రం వీటిని చూసే దిక్కే లేదు. అదీకాక, వీటిమీద అభివృద్ధి ఐన

సినిమాలకంటే—వీటిలో కళ ఎక్కడుందో నాకూ అర్థం కావడం లేదు. పోనీ, వీటిని తిరిగి పైకి తెద్దామా అంటే కొత్తవాసనలతో బయలుదేరితేనేగాని ప్రజాదరణ పొందలేవు.

ఈమధ్య మనవూళ్లో కొందరు కుర్రవాళ్లు తోలుబొమ్మలు ఆడించారు. ఈ ఆట పూర్వం ఆటలా లేనేలేదు. బొమ్మలు మారిపోయినై. సినిమా తెరలా ఏర్పరచారు. పాటలు మారిపోయినై. వీలైనంతవరకు సినిమాకి దగ్గర్లోకి తీసుకురావటానికి ప్రయత్నించారు. యిక పునరుద్ధారణ ఎలా జరుగుతుంది చెప్పు?

నిన్న టౌన్ పెద్దమనుష్యులు కొందరు, మనవూళ్ళో పార్టీలు రాజీచేద్దామని వొచ్చారు.

యుద్ధంవల్ల కలిగే పరిస్థితులు చెప్పి, వాటినుంచి తప్పించుకోడానికి ఊరంతా ఏకం కావాలనీ, అప్పుడు కాని మనల్ని మనం రక్షించుకోలేమనీ బోధించారు. పార్టీలు కలిసేటట్టు వున్నాయి. శత్రువుల దాడి భయంవల్ల పల్లెటూళ్లల్లో ఐకమత్యం కలిగితే—ఇంకేం కావాలీ?

పార్టీలు కలుస్తయ్యంటేనే నాకు చాలా సంతోషంగావుంది. ఇహ గట్ల దగ్గర తగాదా లుండవు. ఎలక్షన్లవల్ల కోపాలు పెరగవు. చెర్లో చేపలు పట్టుకోడానికని రైటింగులు జరగవు. మళ్లీ కొన్నాళ్లైనా సుఖంగా బతుకుతాము.

జపాను బర్మాను బాంబుచేసే వరకూ, బర్మాలో జరిగిన ఘోరాలు మనకు తెలిసే వరకూ, జపాను మన మీద బాంబులు వెయ్యదనీ, నల్లజాతుల్ని చాలా అపేక్షగా చూస్తుందనీ సుబ్బారావు ప్రచారం చేశేవాడు. యీ బర్మా వార్తల వల్ల యీ అపోహ తొలిగిపోయింది. సాంరాజ్యాన్ని విస్తరిం

చుకోడానికి జపాను ఏ పనైనాచేస్తుం దని తేల్చుకున్నారు. సామ్రాజ్యతృష్ణ కలిగిన దేశానికి నలుపూ తెలుపూ అనే విచక్షణ ఎందు కుంటుంది?

నువ్వు కులాసాగానే వున్నా వనుకుంటాను. అక్కడ నుంచి వచ్చేద్దా మనుకుంటున్నావా? అక్కడే వుంటావా? "యుద్ధ భయంవల్ల ప్రజలకు సహాయపడే మనుష్యులే దొరకటం కష్టమయ్యే యీరోజుల్లో అతడు అక్కడుంటేనే బాగుంటుంది. ప్రజలకు ఆపత్కాలంలో అనేక రకాలగా సహాయపట్టానికి వీలవుతుంది. యిప్పుడు అతడు యిక్కడకువచ్చి చేసేదేముంది?" అంటున్నాడు క్రిష్టయ్య. యీవిధంగా నీకు రాయమని చెప్పాడు కూడాను.

తరువాత నీయిష్టం.

యుద్ధ భయంవల్ల షాహుకారు బ్రహ్మయ్య తనకు రావలసిన బాకీలన్నీ వసూలుచేసి రూపాయలుగా మార్చి యింట్లో పెట్టుకుని కాపాడుతున్నాడు. ఎవ్వరికీ అప్పులివ్వటంలేదు. అన్నీ రూపాయిలే! వాటిని కాపాడలేక అతడు పడే బాధలు చెప్పమంటావ్! రాత్రిళ్లునిద్ర లేదు. ఒక్క కునుకు లేకుండా కాపలా కాస్తున్నాడు. పగలంతా పిచ్చివాడిలా తిరుగుతున్నాడు. ఎప్పుడూ యిదే ఏవ! చాటుగా ఎవ్వరూ లేనప్పుడు నాదగ్గరకువచ్చి, "అబ్బాయీ! యుద్ధంఎట్లావుంది?" అని అడిగి పోతుంటాడు. క్రిష్ణయ్య అతనికి ఎన్నోవిధాల చెప్పి చూశాడు. డబ్బు యింట్లో పెట్టుకొని కూర్చోవటం వల్ల వచ్చే నష్టకష్టాలు విపులంగా చెప్పాడు. "పోసీ పొలం కొనండి. అప్పులివ్వటంవల్ల మీ కేమీ నష్టంలేదు. నామాట వినండి. యుద్ధనిధికి సహాయం

చెయ్యండి. డిఫెన్సు కమిటీకి కొంతడబ్బు యివ్వండి," అని అనేక విధాల చెప్పి చూశాడు.

"అబ్బే నాదగ్గర డబ్బెక్కడిదిరా? గిట్టనివాళ్లనే మాటలు. నీతోడు," అని ఒట్టుపెట్టుకున్నాడు బ్రహ్మయ్య. కాని క్రిష్ణయ్య అతన్ని అంతటితో వొదల్లేదు. రోజూ వుపదేశం చేస్తూనే వున్నాడు.

"వింటాడు. వినకేంచేస్తాడు?" అంటున్నాడు.

ఇక సెలవు.

అంతాక్షేమం.

ఇట్లు

కోటేశ్వర్రావు

## vii

గున్నేరు
౭—౧—౪౩.

గోపీ,

వారంరోజుల కిందట, మన ఊళ్ళో ఒక బుర్రకథ చెప్పించాం. చెప్పించాం అంటే, మన కుర్రవాళ్ళే నేర్చుకొని చెప్పారు. బుర్రకథ అంటే పూర్వం కథలే అనుకొనేవు! కాదు. ఇప్పుడు జరుగుతూవున్న యుద్ధాన్నిగురించి మన క్రిష్ణయ్యే రాసి, తరిఫీదుచేసి చెప్పించాడు - మన బలరామయ్యే చెప్పాడు. చుట్టుపక్కల పల్లెటూళ్ళనుంచికూడా జనం విరగబడి వొచ్చారు. రష్యాలో జర్మనీవాళ్ళు చేస్తున్న ఘోరకృత్యాలూ, తూర్పున జపాన్‌వాళ్ల దుండగాలూ వర్ణించి చెపుతూవుంటే, జనం ఎంత ఉద్రేకపడిందని చెప్పను! కన్నీరు కార్చేవారు జొటజొట కార్చారు. కొంతమంది ఆవేశంతో తుకతుకలాడారు. కథ చెపుతూవుంటే, ప్రేక్షకుల్లో కొంతమంది, వొళ్ళుమరచి విరోధి రాజ్యాలను, అప్పటికప్పుడే జనంలోనుంచే బూతులుకూశారు—

"దొంగ ముండాకొడుకులు."

"రాక్షసి ముండాకొడుకులు."

"అయ్యయ్యో!... ...చ్‌చ్‌చ్‌చ్"

"పాపం!"

ఈవిధంగా, కథ పూర్తయ్యేవరకూ, ప్రేక్షకులు తమలో తాము అనుకుంటూనే వున్నారు—పూర్తి అయింతర్వాత, మావూరువొచ్చి కథ చెప్పవలసిందంటే మావూరువొచ్చి కథ

చెప్పవలసిందని, కోరారు. వాళ్ళనిచూసి, తన కథ వాళ్ళల్లో కలిగించిన మార్పుచూసి క్రిష్ణయ్య ఏమి సంతోషించాడని చెప్పను ?

ఆ సీను చూడవలసిందే !

పల్లెటూళ్లల్లో ప్రచారానికి, ఈ బుర్రకథలూ, జంగంకథలూ ఉపకరించినట్లు, మరేవీ ఉపకరించవు సుమా ! మిగిలిన సాధనాలన్నీ చదువుకున్న వాళ్ళకే పనికివస్తాయి. సిసలైన పల్లెజనం ఉంది చూశావూ—వాళ్లదాకా ఇవి వెళ్ళవు. కథలు మాత్రం అల్లాకాదు. స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ చదువుకున్న వాళ్లూ—అంతా వొస్తారు. విని ఆనందిస్తారు. ఈ విషయం మనవాళ్ళు గమనించి, ప్రధానసమస్యల్ని, ఈ రకం కథలద్వారా చెప్పిస్తే పల్లెల్లో ప్రచ్చారం సులభంగా, జయప్రదంగా జరిగేటట్లు ఉంది.

కిందటిసారి రాసిన ఉత్తరంలో, ఒక పెద్దమనిషి మన వూరొచ్చి, రైతులకు మంచిసలహాలిచ్చాడని రాశాను. కాని పనితొందరవల్ల, ఆయన చెప్పినవన్నీ విపులంగా రాయలేక పోయాను. ఇప్పుడు రాస్తాను :—

మనం పంట బాగా పండించాలంటే, సాగు శ్రద్ధగా కష్టపడి చెయ్యాలి. సేద్యం బాగా చెయ్యటానికి ఎద్దులు ముఖ్యావసరంగదా! మంచి ఎద్దుల్లేని సేద్యం కంకెలులేని వరిలాగా వుంటుంది. కిరాయి నాగళ్ళుపెట్టీ, ఏదో ఒక జతని అడ్డంపెట్టీ సేద్యం చేస్తే భూమికితగిన పంట రమ్మంటే ఎక్కడనుంచి వస్తుంది చెప్పూ ? మనవాళ్ళు ఎలక్షన్లకీ, ఔన్‌కి తిరగటానికీ, మరింకా దేనికైనా దుబారా చెయ్యటానికి వొప్పుకుంటారుగాని, మంచి ఎద్దుల్నికొని పోషించే విషయంలో తటపటా

ఇస్తా రెండుకో !

ఇప్పటి పల్లెటూళ్ళల్లోని ఎద్దుల్ని చూస్తే, ఈవిషయం నీకే తెలుస్తుంది. ఖరీదుపెట్టి ఎద్దుల్ని కొనటం దుర్వ్యయం అనే అపోహ మనవాళ్లకి బయల్దేరింది. పైగా మంచి ఎద్దుల్నికొన్నప్పటినుంచీ, వాటిపోషణకు రోజువారీ ఖర్చు పెరిగిపోతుందట!

మన పెద్దవాళ్లు ఎద్దుల్ని ఎంత జాగ్రత్తగా పెంచేవాళ్లో నీకు తెలుసు! ఆడంగులూ, మొగవాళ్లూ కూడా కన్నబిడ్డల్ని పోషించినట్లు పోషించేవాళ్లు. ఎద్దులకూ, ఆవులకూ, తమ పిల్లల పేర్లే పెట్టుకొని అపూర్వంగా పెంచుకొనేవాళ్లు. మా నాన్న, మా ఆవుకి పుట్టిన కోడెదూడకి 'కోటిగాడు' అని పేరు పెట్టుకోవటం నువ్వు ఎరుగుదువుగా! మా అమ్మ ఇంకొక దూడకు 'తులిసెమ్మ' అని పేరు పెట్టుకుంది? మా అమ్మ తులిసి పూజలు చేసే రోజుల్లో ఈ దూడపుట్టడంవల్ల ఈ పేరు పెట్టుకుంది. 'కోటిగాడు' చచ్చిపోయినప్పుడు ఇంటిల్లపాదీ అన్నాలు తిన్నారా? మానాన్న ఏడాదివరకూ, కోటిగాణ్ని మరచిపోలేక పోయాడు. రోజూ కోటిగాడి తల్లి దగ్గరకు వెళ్లి, నిమురుతూ కూర్చునేవాడు. ఆ ఆవుతోపాటు తానూ కంటనీరు పెట్టుకుంటూ కూర్చునేవాడు. మా అమ్మ, "బాబూ, కోటిగాడు కళ్లల్లో మెదుల్తున్నాడ్రా! ఎక్కడున్నాడో నా బిడ్డ!" అంటూ వుండేది. ఒక రోజు పొద్దున్న, మా అమ్మ నన్ను పక్కమీద నుంచి లేపి, "బాబూ, రాత్రి కోటిగాడు కలలో బసవన్న రూపంలో కనిపించాడ్రా," అని చెప్పి కంటనీరు పెట్టుకుంది. ఈ కథ మా అమ్మ ఇరుగు పొరుగు వాళ్లకు చెప్పినప్పుడు, "నీ కడుపున పుడతాడ్లే అత్తయ్యా," అన్నారు అందరూ!

అప్పుడు నాకు చిన్నతనమైనా ఈ సంగతులన్నీ కళ్లకు కట్టి నట్టు గుర్తున్నై. పశుసంపదతో అప్పుడు రైతులకున్న సంబంధం, పశువుల మీద అప్పుడు రైతులకున్న ప్రేమా, ఇప్పు డేదీ! ఇప్పుడు రైతు వేసేది ఒక్కటే లెక్క —"వందరూపాయీలు పెట్టి ఎద్దులు కొన్నదానికంటే, ఏభై రూపాయీలు పెట్టికొంటే, నాకు ఏభై రూపాయీలు లాభం. ఎద్దులకు రోజూ గుగ్గిళ్లు వేసిందానికంటే ఉత్తి ఎండుగడ్డితోనే (జనపకట్టలుకూడా లేవు) పెంచితే అంతా లాభమే! కడుపులో కాలితే తినక చస్తుందా యేమిటి?"—అనే ఆలోచనే ఎంతసేపూ!

ఈ పెడమార్గం, ఈ తప్పుడు సిద్ధాంతం రైతుని ఎంత అధో గతికి తీసుకుపోయిందంటే, కొంతమంది దూడలకు పాలు విడ వటం కూడా మానేస్తున్నారు. తల్లి చేపేవరకే దూడ ప్రయో జనం. తల్లి దూడకోసం "అంబా, అంబా" అంటూ అరుస్తూనే వుంటుంది. దూడ కట్టుగుంజనుంచి తప్పించుకు రావటానికీ— తల్లిపాలు తాగటానికీ గుంజుకుంటూనే వుంటుంది. రైతు, పాలు ఒక్క చుక్కన్నా విడవకుండా పితుక్కొని, పాల తెప్పాళా తీసుకొని ఇంట్లోకి వెళ్లనే వెళ్తాడు. ఆ దూడ, అక్కడొక గడ్డి పరకా, ఇక్కడొక గడ్డి పరకా ఏరుకొని, తిని జీర్ణించుకో గలి గితే బతుకుతుంది—లేకపోతే ఎండి వరుడై చస్తుంది. దూడ చావటంవల్ల తల్లి పా లివ్వకపోతే, గడ్డిదూడలు తయారవుతై! ఆ దూడనే నాకుతూ, ఆ స్పర్శసుఖంవల్లే చేపి, ఆవు పాలి స్తుంది—రైతుని పోషిస్తుంది.

నిజంగా ఆలోచిస్తే, దూడని జాగ్రత్తగా పెంచుకొని అమ్ము కున్నా దాని మీద పెట్టిన పెట్టుబడికంటే ఎక్కువ డబ్బే

వొస్తుంది. కాని రైతు అంతదూరం ఆలోచించటంలేదు. రైతు చూపు చిన్నదై పోయింది. ఎంతసేపూ ఇవ్వాళ ఏం చేస్తే ఒక్క అణా మిగుల్తుందా? అనే ఆలోచనే అయిపోయె! మొన్నటి ఉపన్యాసకుడు, ఈ చూపునీ, దీనివల్ల వచ్చే నష్టాన్నీకూడా విమర్శించి రైతు బాగుపడాలంటే, పశువులను గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలని చెప్పాడు.

చారగల ఎద్దుల్నీ, పుష్టిగల ఎద్దుల్నీ, పుటక గల ఎద్దుల్నీ కొనటం నష్టమని అనుకోటం పొరపాటు. పంటకి పశువులే ముఖ్యం. యముకలు వెళ్లుకొచ్చే పశువుల్తో సేద్యం చేస్తే భూమి సగానికి సగమే పండుతుంది. పుష్టిగల ఎద్దులు ఒకసారి దున్నిన దుక్కి, బక్కచిక్కిన ఎద్దులు నాలుగైదుసార్లు దున్న వలసివస్తుంది. దీనివల్ల కాలం దుబారా అయిపోతుంది. దీనికి మన భూషయ్యే తార్కాణం. తన ఎద్దుల్తో బలరామయ్య జొన్నుంచి పాటిమన్ను రోజుకి నాలుగుతడవలు తోలితే, భూషయ్య తన డొక్కుల్తో రోజుకి ఒక్కతడవ తోలేటప్పటికి ఎద్దులు కాడి కింద పారవేస్తయ్. మంచి ఎద్దులు ఒక్క జత చేసే పనికి బక్క ఎద్దుల్ని రెండు జతలు పెట్టవలసివస్తుంది. తెలియక అనుకోవటమేగాని, దీనివల్ల వచ్చే లాభం ఏముంటుంది?

వ్యవసాయానికి పుష్టిగల ఎద్దులు ముఖ్యం అయినప్పుడు, రైతులు ఆవులను చాలా జాగర్తగా పోషించుకోవాలి. ఆవుల పోషణ జాగర్త తీసుకోకపోతే మంచి ఎద్దులు ఎట్లావస్తవి? ఆవుల పోషణకు అయ్యేఖర్చు దుర్వ్యయం అనుకోగూడదు. పెయ్యదూడని జాగర్తగా పెంచితే మూడున్నర సంవత్సరాలకే కడుతుంది. లేకపోతే నాలుగున్నర సంవత్సరాలూ, అంతకంటే

ఎక్కువకాలం పడుతుంది. అప్పటికైనా ఈసుకు పోవటమో పనికిరాని దూడల్ని పెట్టటమో జరుగుతుంది. మూడువందలూ నాలుగువందలూ పెట్టి ఎద్దులజత కొన్నదానికంటే, ఆవుల విషయంలోనే జాగ్రత్త తీసుకొని కోడెదూడల్ని కలిగివుండటం చౌకే అవుతుందిగాని ప్రియం అవదు. బాగా పెంచబడ్డ ఆవు ఏడు ఎనిమిది దూడలను పెడుతుంది; ఎక్కువ పాలు ఇస్తుంది. ఈ సంగతి తెలిసి ఉండి కూడా రైతులు ఆవులను పెంచే విషయం శ్రద్ధచూపటంలేదు. పసిపిల్లలకు ఆవుపాలు మంచిది అని తెలిసికూడా, ఆవులను పెంచక గేదెపాలేపోసి, రోగాలు తెచ్చుకొని డాక్టర్లకు డబ్బుపోస్తున్నారు. లేకపోతే టౌన్‌నుంచి ఎక్కువడబ్బు ఖర్చుపెట్టి, తక్కువ గుణాన్నిచ్చే పాలడబ్బాలు కొని, పోస్తున్నారు. ఈఖర్చులన్నీ ఒక్క ఆవు వుంటే తీరిపోవూ? ఈ అర్థంలేని, కొరగాని లోభితనం రైతులకు ఎక్కడ దాపరించింది? ఎట్లాపోతుంది ?......

ఆ ఉపన్యాసకుడు, ఇవేకాదు - ఇంకా చాలా సలహాలు చెప్పాడు. పొలం ఎప్పుడు దున్నాలో, ఏవిధంగా దున్నాలో, నారు ఏవిధంగా పొయ్యాలో, ఏవిధంగా నాటాలో, విత్తులు ఎలావుంచాలో, ఏవిధంగా జాగ్రత్తచేసుకోవాలో, కోతలూ కుప్పలూ వెయ్యటం మొదలైనవి ఎట్లా చేసుకోవాలో, చెప్పాడు. ఎక్కువమంది రైతులు ఈ ఉపన్యాసాన్ని అపరాధ పరిశోధక నవలను విన్నట్లు విని వెళ్ళిపోయినా, కొంతమందిలో మాత్రం మార్పుకలిగించింది. ప్రస్తుతంమాత్రం 'వ్యవసాయంలో ఎక్కువశ్రద్ధ తీసుకోవలసిందే' అంటున్నారు. నాలుగురోజులు గడిచింతర్వాత మళ్ళీ యథాప్రకారమే అవుతుందో ఏమో

చెప్ప లేను.

ఇప్పుడిప్పుడే, అక్కడక్కడా పశువులను గురించి శ్రద్ధతీసు కోవాలని ఆందోళన బయల్దేరింది. మనపక్కవూళ్లో—కామయ్య వూరు, జ్ఞాపకం వున్నాడా?—పెద్ద పశుప్రదర్శనం జరిగింది. ఎడ్లపందాలు — రకరకాల పందాలు జరిగినై. అందంగల ఎద్దులకూ, పుటకగల ఎద్దులకూ, బలంగల ఎద్దులకూ, బహుమానాలు ఇచ్చారు. ఇంతేకాదు! వ్యవసాయ సామగ్రిలు కొత్తవీ, మంచివీ ఉపయోగకరమైనవీ తయారుచేసిన వాళ్ళకుకూడా బహుమతులిచ్చారు.

ఈ ప్రదర్శనంలో రైతులు చాలా ఉత్సాహం చూపించారు. తిరనాళ్ళకువచ్చినట్లు వచ్చారు. తమ తమ ఎద్దుల్ని తీసుకువచ్చారు; పందాలు వేశారు. ఈఉత్సాహాన్ని పట్టిచూస్తే త్వరలోనే రైతు మళ్ళీ పశుసంపదను సేకరిస్తాడని ఆశకలిగింది నాకు. గెలిచిన ఎద్దులను చక్కగా ముచ్చటగా అలంకరించి చుట్టుపక్కల గ్రామాలన్నీ ఊరేగించారు. ఆ వూరేగింపు చూట్టానికి కన్నుల పండుగ్గావుంది. నాకుకూడా, మానాన్నకు మల్లే, అమ్మకుమల్లే, మాకోటిగాడు గుర్తొచ్చాడు—కన్నుల్లో నీరు గిర్రున తిరిగింది......

ఇక సెలవా?

మొదట్లో మమ్మల్నిగురించి నీ కిన్ని ఉత్తరాలు రాద్దామనుకోలేదు. నువ్వుఅడిగావుగదా అని మొదలుపెట్టాను. కాని రాయటం మొదలుపెట్టిం దగ్గరనుంచీ—ఇన్నాళ్ళనుంచీ లోపల అణగివున్నాయేమో!—తెములుకు తెములుకు వొస్తున్నాయి సంగతులు. మూగవాడికి మాటలు వొచ్చినట్లుగా

వుంది నాపరిస్థితి!

నేను ప్రస్తుతం పెద్ద అమ్మాయి సంబంధం కోసం తిరుగుతున్నాను. మన పెద్దవాళ్ళలాగు చెప్పులు అరగటంలేదు గాని, మనస్సు సారవేసుకొని పోతూవుంది. కొద్దో గొప్పో చదువుకున్నవాడికి ఇవ్వాలని ఆశ! వాళ్ళేమో కొండెక్కి కూర్చుంటున్నారు. "తే కట్నం!" అనే మాటే ఎంతసేపూ. వాళ్లా సంపాదిస్తూంది ఏమీ లేదు. కట్నం మాత్రం కావాలి—సంపాదించక పోబట్టే నేమో కట్నంమీద ఇంత ఆశ!!

ఈమాట క్రిష్ణయ్యతో అన్నాను—"మీరు ఇన్ని కబుర్లు చెప్తారూ, ఇన్ని ఉపన్యాసాలిస్తారూ, ఎప్పుడూ 'సంఘం' 'సంఘం' అంటూవుంటారూ, ఈ కట్నాలు లేకుండా చెయ్యలేరూ?" అని అడిగాను.

"ఇచ్చేకట్నం ఏదో మీఅమ్మాయిపేరేపెట్టు," అన్నాడు క్రిష్ణయ్య.

"అమ్మాయిపేరే లేపెట్టేది. కానిదానికైనా డబ్బుకావొద్దూ?" అన్నాను.

ఇకచూశావ్? ఈమాట అనేటప్పటికీ, రేచల్లే లేచాడు-"ఏం? కొడుకులకి ఆస్తి ముక్కలు ముక్కలుచేసి ఇవ్వటానికి సంకోచించవుగానీ, కూతురికి నాలుగువేలు కట్నం ఇవ్వటమనేటప్పటికి గొంతు పట్టుకుంటుందేం!" అన్నాడు.

"అయితే కూతురూ కొడుకూ ఒక్కటేనంటావా?" అని అడిగాను.

"ఒకటికాక?" అని ప్రశ్నించాడు.

"వంశాన్ని నిలబెట్టేవాడు వీడాయె! ఎప్పటికైనా తల్లిదం

ద్రాదుల్ని విడిచిపెట్టిపోయేది అదామె," అన్నాను.

"అదే పొరపాటు! స్త్రీని ఎప్పుడూ అమ్ముడుపోయే పదార్థంగానూ, కొనుక్కునే పదార్థంగానూ చూడబట్టే మనసంఘం ఈ దుస్తితిలో వుంది—" అన్నాడు.

"అయితే, ఏం చెయ్యమంటావ్?" అని మళ్ళీ అడిగాను.

"అసలు స్త్రీకి కూడా తండ్రి ఆస్తిలో హక్కు ఉండేటట్లు చెయ్యాలి. పిత్రార్జితం కొడుకుతోపాటు కూతుళ్ళకు కూడా పంచాలి. ఇది చట్టసమ్మతం అయ్యేవరకు కట్నంపేరనో, కానుకపేరనో, ఆమెకు ఆస్తి ఏర్పాటుచెయ్యాలి."

"భర్త దుర్మార్గుడైతే ఏమవుతుంది?" అని అడిగాను.

"కాజేస్తాడంటావా? స్త్రీ అబలగా వున్నంతకాలం సంఘంలో ఈ అన్యాయానికి చోటు ఉండనే ఉంటుంది. అందుకని ఆమెకు ఆస్థి లేకుండాచేసి ఆర్థికంగా భర్తకు బానిసగా ఉండేటట్లు చేస్తానంటావా ఏమిటి?—నువ్వుచెప్పేది ఎలావుందంటే దొంగలు ఎత్తుకుపోయే అవకాశం ఉందిగనక, అసలు డబ్బు సంపాదించనేవొద్దు అనే మెట్టవేదాంతంలాగుంది—"అన్నాడు. క్రిష్ణయ్య ఈవిధంగా మాట్లాడుతూ వున్నంతసేపూ నాకు 'నిజమే సుమా!' అనిపించింది. కాని ఎప్పటికైనా పర కుటుంబంలోకి వెళ్ళే వాళ్ళనిగానే, ఆడపిల్లలను చూట్టం అలవాటై. ఎంతసమాధానపరచుకున్నా మనస్సు కుదటపట్టంలేదు.

ఏమీ తోచకుండావుంది.

ఇప్పటికి సెలవు.

ఇట్లు

కోటేశ్వర్రావు

# పి. యస్.

ఇవీ—పల్లెటూరి జీవితాన్ని గురించి నా రేడియో ప్రసంగాలు. ఈ ప్రసంగాల్లో పల్లెటూరి జీవితాన్ని సంపూర్ణంగా చిత్రించాలనేభావం నాకు లేదు—చిత్రించాలనే కుతూహలమూ లేదు. ఎందుకంటే రైతుకి నేను చెప్పిందీ, అసలు చెప్పవలసిందీ ఒక్కటే సలహా. 'కొత్తపద్ధతిలోని చెడుని మాత్రమే చూచి, వెనక్కి దేకటమే శ్రేయస్కరం అని అనుకోవొద్దు,' అని. 'ఇల్లా చెప్పే వాళ్ళమాటలు చచ్చినా నమ్మవద్దు' అని!!

ఇప్పటి రైతు జీవితపద్ధతిలో లోటున్నమాట నిజమే! ఈ పద్ధతిమారితే రైతు బాగుపడేమాటా నిజమే! కాని దీనికి మందు మాత్రం వెనక్కి దేకటంకాదు. పూర్వపద్ధతి బొత్తిగా సరిపడకే ఈ పద్ధతి తెచ్చుకున్నాం అనే సంగతి మనం మరచిపోతే ఎట్లా? ఈ పద్ధతికూడా సరిపడకపోతే మరొక పద్ధతికోసం వెతకాలి గాని, పనికిరాక విడిచిపెట్టిన పద్ధతిని తెచ్చుకోవటంవల్ల లాభం లేదు.

## పూర్వయుగం

చాలామంది మన పూర్వయుగంలో కూలిజనం అనేవాళ్లే లేరనీ, మానవులంతా సోదరభావంతో జీవించేవారనీ చెబుతారు. దీన్నే స్వర్ణయుగం అని చెప్పుకొని లొట్టలు వేసుకుంటూ వుంటారు. ఇది చాలా పొరపాటు.

కూలిజనమే లేకపోతే చైనాగోడవంటి గోడలూ, టాజ్ మహాల్ వంటి కట్టడాలూ, అజంతా గుహలవంటిగుహలూ ఎక్కడ నుంచి వస్తయ్? రాజులే కట్టారా? ఎక్కడిమాట!

కూలిజనం వున్నా భేదాలు ఇప్పుడున్నంత తీవ్రంగా లేవు అంటారు కొందరు. తీవ్రంగా లేనిమాట నిజమే! కాని ఇందులో గొప్పగానీ, భుజాలు ఎగరవేసుకోవలిసిందిగానీ ఏముంది? పీడింపబడే జనానికి చైతన్యం లేక దాస్యమే పరమావధిగా పెట్టుకున్నప్పుడు భేదాలు ఏమివుంటయ్? సర్వం జగన్నాథమేగా!

ఒకవేళ ఎక్కడోఒకడు తలెత్తినా మతోద్ధరణ అనేపేరుతో హతమార్చటం జరుగుతూనే వుండె! మతోద్ధరణ అనేపేరుతో ఎన్ని యుద్ధాలు జరగలేదు? ఎంతమంది నాశనంకాలేదు?

ఇంకా వెనక్కువెళ్తే ప్రపంచంలో కూలిజనం లేనిమాట నిజమే అవుతుంది. కాని అప్పుడు జీవితం ఏముంది? ఏపక్షినో మృగాన్నో చంపుకుతినటం, చావటం. అంతేగా అప్పటి జీవితం. కందమూలాలు తింటూ కూర్చుంటే ఇప్పుడూ కూలిజనం ఉండదు. ఎందుకంటే అంతా కూలిజనమే అవుతుందాయెను!

ఈ స్థితిలో మానవుడు వర్గాలు లేకుండా వర్గకలహాలు లేకుండా బతికాడంటే బతికి ఉండొచ్చు. ఇందులో ఆశ్చర్యం లేదు. ఇప్పుడు గేదెలూ పందులూ వర్గాలులేకుండా వర్గకలహాలు లేకుండా తిండికరువులేకుండా బతకటంలా!

కాని ఇదేనా మానవుని ఆదర్శం?

కాదు.

## ఆదర్శం

మానవుని ఆదర్శం ప్రకృతిని మానవసంఘంకోసం ఉపయోగించుకోవటం—మొదట్లో అడవులుపట్టుకుతిరిగాం. ఆకూ అలం తిన్నాం. తరవాత పదిమందిమి ఒకచోట జేరాం. ప్రకృతి దానంతట అది ఇచ్చేదేకాకుండా బలవంతంగా ప్రకృతినుంచి ఆహార

పదార్థాలు పుచ్చుకున్నాం. ప్రకృతిని పిండటానికి మానవునిశక్తి దానంతట అదిచాలకపోయేటప్పటికి యంత్రాన్ని తెచ్చుకున్నాం.

## యంత్రం

ఈ సంగతిచూద్దాం......

యంత్రాన్ని తెచ్చుకున్నాం--పరిశ్రమలు పెట్టుకున్నాం. పరిశ్రమలవల్ల అనేక లాభాలు వొచ్చినై. ప్రకృతిని మానవుడు లోబరచుకొని తన శ్రేయస్సుకి ఉపయోగించుకో గలుగుతున్నాడు. కాని ఇన్ని లాభాలతో కలసి ఒకటి నష్టంవొచ్చింది.

అదే—కాంపిటీషన్.

ఈ కాంపిటీషన్ అనే నష్టం యంత్రంవల్ల వొచ్చింది కనక అసలు యంత్రాలనే నిర్మూలించి యంత్రాల్లేనియుగంలోకి వెల్దాం అంటే అర్థం ఏముంది? ఆ నాగరికత ఒకప్పుడు మనం అనుభవించిందేగా! పనికి రాదని తోసిపుచ్చిందేగా! కనక పరిశ్రమలను పరిశ్రమలుగానే వుంచుకొని, వాటివల్ల వచ్చే లాభాలను అనుభవిస్తూ, అనర్థకాన్ని-కాంపిటీషన్-నిర్మూలించాలి. అప్పుడు మనం ఒక కొత్త పద్ధతిలోకి పోతాం! ఒక సమస్యను పరిష్కరించిన వాళ్ళం అవుతాం! జనం సుఖపడుతుంది.

## డబ్బు గుల—కీర్తి దాహం

'స్వార్థపరుడు' అనే మాట మనం మాటమాటకీ వింటూ వుంటాం. ఈ స్వార్థపరుడంటే సంఘానికి గిట్టదు. కాని సంఘంలో స్వార్థంలేన్ది ఎవ్వరికి? స్వార్థం అంటే వ్యక్తి తన సుఖంకోసం తంటాలు పట్టమేగా! తన సుఖం కోసం తంటాలు పడని మానవుడు మన సంఘంలో ఎక్కడవున్నాడు? స్వార్థం

లేని మానవుడొకడుంటే వాడెందుకు బతుకుతున్నట్టు? ఎందుకు బతకాలి?

నాపలు!!!

ఇక మిగిలివాళ్ల సంగతి ఆలోచిద్దాం—

కొంతమందికి డబ్బు గణించటంలో సుఖం వుంటుంది. కొంత మందికి కీర్తి సంపాదించటంలో సుఖంవుంటుంది. కొంతమందికి ఇతరులకు సహాయం చేశాం అనుకోవటంలో సుఖం వుంటుంది. అంటే—పర్యవసానం ఏమిటంటేమానవుడు ఎన్ని వేషాలువేసినా తన సుఖం కోసం అన్నమాటేగా! ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క రకంగా సుఖం కలగటంవల్ల (objective conditions వల్లే అనండి) ఒక్కొక్క రకంగా ప్రవర్తిస్తూవుంటాడు. కాని డబ్బు గుల వున్నవాణ్ని చూస్తే కీర్తి దాహం వున్నవాడికి అలుసు—"లోభిముండాకొడుకు," అంటాడు. కీర్తి దాహం వున్నవాణ్ని చూస్తే డబ్బుగుల వున్నవాడూ అంతే! "సన్యాసి ముండాకొడుకు," అంటాడు. అంతేగాని ఇద్దరి ఆదర్శం ఒకటే, ఇద్దరూ తమతమ సుఖంకోసమే తంటాలు పడేదీ అని ఆలోచించుకోరు.

## భేదం

సామాన్యంగా చెప్పాలంటే డబ్బుగులవున్నవాళ్లూ కీర్తి దాహం వున్నవాళ్లూ ఇద్దరూ సంఘానికినష్టం చేకూర్చేవాళ్లే! కాని భేదంవుంది. ఒకడు ఎంతడబ్బు పోగుచేసినా సంఘానికి ఊడిపడే దేమీలేదు. పైగా ప్రామిసరీనోట్లమీద డబ్బుపెరుగుతూవున్నకొద్దీ తిండిలేక మాడేజనం ఎక్కువ అవుతూవుంటుంది.

కీర్తిదాహం ఇట్లాంటిదికాదు. ఒకప్పుడు డబ్బుగులకంటే

సంఘానికి మేలుచేకూర్చేదీ, ఒకప్పుడు ఎక్కువ ప్రమాదాన్ని కలిగించేదీ! కొంతమంది కీర్తిదాహం ఎప్పుడూ సంఘానికిమంచినే చేకూరుస్తుంది అంటారుగాని నేను వొప్పుకోను. నెపోలియన్ కీర్తిదాహం సంఘానికి మేలుచేసినమాట నిజమే!——కాని హిట్లర్ కీర్తి దాహమో! తన కీర్తిదాహం, సంఘశ్రేయస్సూ ఒకే దారిన నడుస్తూవుంటే సంఘానికి లాభంకలుగుతుంది. అలా కాక దేనిదారి దాన్దే అయితే సంఘానికి ప్రమాదం తటస్థిస్తుంది. ఇది డబ్బుగులా కీర్తిదాహం వున్నవాళ్ళ సంగతి.

## శిష్యకోటి !

డబ్బు గుల వున్న జనం వాళ్ళనీ కీర్తి దాహం వున్న జనం వీళ్లనీ పొగుడుతూ ఉంటుంది. అందుకనే మన దేశంలో ముసలి వాళ్ళు ఉద్యోగస్తుల్నీ వ్యాపారస్తుల్నీ పొడుగుతూ వుంటారు; కుర్రవాళ్ళు రచయితల్నీ రాజకీయవేత్తల్నీ పొగుడుతూ వుంటారు.

## సంస్కారం

జనానికి తిండి ముఖ్యం. తిండివుంటే సంస్కారం అభివృద్ధీ అన్నీ వొస్తాయి: లేకపోతే ఏమీ లేవు. రోజుకి ఒక గంట సేపు పనిచెయ్యటంవల్ల తన భుక్తిని సంపాదించుకోగలిగినవాడు మిగిలిన కాలాన్ని సంస్కారాభివృద్ధికి వినియోగిస్తాడు. లేని వానికి సంస్కారమూ లేదు—అభివృద్ధీ లేదు. మానవుడు అభివృద్ధి చెందాలంటే తీరికవుండాలి. అందుకనే టౌన్లోవుండే వాళ్ళకు పల్లెటూళ్లోవుండే వాళ్ళకంటే ఎక్కువ సంస్కారం ఉంటానికి వీలవుతూవుంది— పల్లెటూళ్లో పదిగంటలు పనిచేసి సంపాదించే సంపాదన టౌన్లో ఒక గంటలోనే సంపాదించే వీలుంది గనక.

## తిండి

తిండి ముఖ్యం అన్నారుగదా! తిండి సంపాదించుకోవటంలో తెలివిగలవాళ్లేచతికిలపడుతున్నారు ఎందుచేతా? అని చాలామంది ప్రశ్నిస్తూవుంటారు.

నిజమే!

కూలివాడు సైతం ఇంతో అంతో సపాదించుకోగలుగుతున్నాడు గాని, బి. ఏ. పాసయినవాడు ఏమీ సంపాదించుకోలేకపోతున్నాడు. సాధారణ మానవుడు బాగా డబ్బు గణించుతూవుంటే మేధావి ఆర్థికంగా అనేక బాధలు పడుతున్నాడు.

దీనికి కారణం ఉంది.

సాధారణ మానవుడికి పొద్దున్న లేచినప్పటినుంచీ ఒక్కటే యావ—డబ్బు సంపాదించటమే! మేధావికి అలాకాదు. డబ్బున్నవాళ్ళనిచూస్తాడు. తిండిలేనివాళ్ళనిచూస్తాడు. సంఘంలో జరుగుతున్న ఘోరాలనుచూస్తాడు. వీటి నివారణకోసం ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో డబ్బుసంపాదన వెనక పడుతుంది.

అందుకని సాధారణ మానవుడే మేధావికంటే తెలివిగలవాడు అనుకోవటం పొరపాటు. సాధారణమానవునివల్ల ఉదరానికీ, మేధావివల్ల సంఘానికీ లాభం కలుగుతుంది.

## ఎవ్వరు దిక్కు ?

మరి డబ్బుగుల వున్నవాడూ సంఘానికి పనికిరాక, కీర్తిదాహం వున్నవాడూ పనికిరాక, సామాన్యమానవుడూ పనికిరాక ఇంకెవ్వరు సంఘాన్ని బాగుచేసేది ? సమిష్టిస్వార్థం ఆదర్శంగా పెట్టుకున్నవాడని నేనంటాను. డబ్బుగులవున్నవాడూ సామాన్యమానవుడూ ఇద్దరూఒక్కటే! ఇద్దరూ అప్పుడు సంఘంలోవున్న

పరిస్థితులకు అనుగుణంగా జీవించి దాటిపోయేవారే! కీర్తిదాహముున్నవాడేమో నమ్మదగనివాడు—ఎడాపెడా కొడతాడు. కనక సంఘానికి ఇక ఒకడే మిగిలాడు. అతడే సమిష్టిస్వార్థపరుడు.

## సమిష్టి స్వార్థం

ప్రజలు సమిష్టిస్వార్థం ఆదర్శంగా వున్నవాణ్నే నమ్మి అనుసరించాలి. ఇతడూ స్వార్థపరుడే! కాని సంఘం మొత్తం బాగుపడందే తాను బాగుపడలేనని ఇతనికి తెలుసు. సంఘాన్ని మొత్తం బాగుచెయ్యటంలోనే ఇతనికి సుఖముంటుంది. అందుకని మిక్కిలి పట్టుదలతో సంఘసేవ చేస్తాడు. ఇలా కాకుండా 'నిష్కామకర్మ' చేసేవాళ్ళంతా ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా జారుకునేవారే! సంఘశ్రేయస్సుకి భిన్నంగా వ్యక్తిస్వార్థానికి తంటాలుపడేవాళ్ళే!!

కనక ప్రజలు వ్యక్తిస్వార్థాన్ని సమిష్టిస్వార్థంతో ముడిపెట్టి పాటుపడే వాళ్ళనే నమ్మి అనుసరించాలి. అప్పుడు తప్పకుండా సంఘం బాగుపడుతుంది.

## ముగింపు

ఈ విషయం ప్రస్తుతం మనదేశంలో ముఖ్యంగా రైతాంగం గ్రహించాలి. తన జీవితాన్ని కట్టుగుంజకే ముడివేసుకూర్చోక, బాహ్యప్రపంచంతో సంబంధం పెట్టుకోవాలి. ఎవరో తమ సమస్యల్ని పరిష్కరించి పెడతారనుకోవడం వుందే—చాలా పొరపాటు.

ఈ ప్రసంగాల్లోని 'చిత్తగించవలెను', 'పి. యస్', రేడియో ప్రసంగాలు కాకపోవడంవల్ల, వాటిల్లో వెలిబుచ్చిన భావాలకు పూర్తిగా నేనే బాధ్యుణ్ని.



ఈ పుస్తకంలో 'ఆముదం' అని వచ్చినచోట 'మంచి నూనె' అని చదువుకోటం శరీరానికి ఆరోగ్యాన్నిస్తుంది. 'గోఘృతం' అని అయితే మరీమంచిది.

# గోపీచంద్ గారి కథలు

## అభిప్రాయాలు

### 'ఆంధ్రపత్రిక'

"దేశం ఏమయ్యేట్టు" కథాసంపుటిలో శ్రీ గోపీచంద్ గారి కథారచనా ప్రతిభ అధికంగా ప్రస్ఫుటమైంది. ఇటీవలఒక కొత్త టెక్నిక్ ఉపయోగంలోకి వచ్చింది. దీని ప్రకారం కథకు "క్లయిమాక్స్" విధిగా ఉండనక్ఖరలేదు. అసలు ఈ టెక్నిక్ ప్రకారం కథలో ఒక సంఘటననుగాని, ఒక అనుభవాన్నిగాని వర్ణించనక్ఖరలేదు కూడా. ఏదైనా ఒకదృశ్యాన్ని గురించిన హృదయంగమ వర్ణన సయితం దీనిప్రకారం కథకాగలదు. శ్రీ గోపీచంద్ గారు తమ ఈ కొత్త కథా సంపుటిలో ఈ కొత్త టెక్నిక్‌నే పూర్తిగా అనుసరించారు. ఇంతేకాదు. ఈ కొత్త టెక్నిక్ అంటే అభిమానంలేని ఈ సమీక్షాకారునికి సయితం "ఇది అనుసరణీయమే!" అనే అభిప్రాయాన్ని కలిగించారు.

"ధర్మవడ్డీ", "ఇలా జరిగేను" : శ్రీ గోపీచంద్ గారి కొత్త కథాసంపుటి లోని ఈ రెండు రచనలు అత్యుత్తమంగా వున్నాయి. ఇంతకంటే ఉత్తమమైన కథలు మనభాషలో లేవనడంలో అత్యుక్తి ఈషణ్మాత్రమైనా లేదు.

కథా రచనపట్ల ఆసక్తిగలవారందరు శ్రీ గోపీచంద్ గారి కథా సంపుటాల్ని శ్రద్ధతో చదివితీరాలి.

### 'సుకుమార్'

"...నేను సాధారణంగా రెండణాల పత్రికలనుగాని, అణా పత్రికలనుకాని కొనను. అది ఒక సబబుకాని అసహ్యం కావచ్చు. లేక, ఎప్పుడో ఒకసారి ఎవరిచేతిలోనో చూచి అందిపుచ్చుకు చదువగా ఒకానొక చౌక పత్రికమీద కలిగిన విరక్తి ఆజాతి అంతటిమీదికి ప్రబలివుండవచ్చు. కాని- ఆమధ్య తమలపాకుల అంగడి దగ్గరకు వెళ్ళినప్పుడల్లా "వి—"వుందా,"వి—" వుందా అని అడగడం మొదలుపెట్టాను. ఇన్నాళ్ళూ ఎన్నిపర్యాయాలు అల్లాంటి పత్రికలు కొనమని అడిగినా యీసడించి వస్తోవున్న నేను యీ క్రొత్త "వి—" కోసం యింత ఆప్యాయం చూపడం అంగడివానికి ఆశ్చర్యమేసింది......ఇల్లా నాలు

గ్గైదు "వి—" లలో కాబోలు శ్రీ గోపీచంద్ గారి కథలు చదివాను. అన్నీ మొదట వీధిలోనే చదివాను. తర్వాత ఒక్కొక్కటే అనేక పర్యాయాలు పడకలో చదివాను...... చెప్పవలసినది చప్పున, టూకీగా, తిన్నగా చెప్పగలడు గోపీచంద్. అంతేగాక తను కథ చెపుతున్నాను, తను చెప్పే కథ ఎవరో వింటున్నారు అనే ధోరణిలేదు గోపీచంద్ కి. ఈ ఒక్క గుణమే చాలు — యీయన వ్రాసిన కథలని, యితర గొప్ప తెనుగు రచయితల కథలనుంచి ప్రత్యేకపరుస్తుంది.

'ఢంకా'

గోపీచంద్ గారి రచనలన్నీ తెలుగుపాఠకులకు చిరపరిచితాలే. ఒకరోజుకంటే యింకొకరోజు సామాజిక సాహిత్య విజ్ఞానంలో గోపీచంద్ గారు ముందంజ వేస్తున్నారనడానికి యీ పుస్తకం నిదర్శనంగా వెలుగొందుతోంది.

ప్రతికథా, చదవడానికి ఎంతో ఇంపుగావుంది. భారతజాతీయ పురాతన ఛాందస మతాచారులు మటుమాయం కావాలంటే గోపీచంద్ గారి రచనలన్నీ చదివితీరాలి.

'రాడికల్'

...లక్షణయుక్తమైన చిన్నకథలు వ్రాయటంలో వీరు సిద్ధహస్తులు. పెద్దపెద్ద నవలలు వ్రాస్తూ చిన్నకథలు వ్రాస్తున్నామనుకునేవారు చలామణి అవుతున్న ఆంధ్రసాహిత్య రంగంలో, యీ కథలసంపుటికి ఎలాంటి స్థానం వుంటుందో అన్నది చాలా సందేహాస్పదమైన విషయమే!...

చెప్పదలచుకున్న విషయాన్ని, నాజూకుగా, సజీవమైన సంభాషణలో, వాక్యాల్లో పొందికగా చెప్పగలరు. వీరి కథలు విజ్ఞానులకు ఎంతగా అర్థమై, ఎంత బావుంటయ్యో, పామరులకుసైతం అంతగా అర్థమయి అంతగా బావుంటయి. రానున్న సంఘపరిణామంలో సాహిత్యం ఏట్లావుండాలో అన్నది గోపీచంద్ గారు యీనాడే వైతాళికులై చూపిస్తున్నారు.

"దేశం ఏమయ్యేట్టు", "పిరికివాడు", "ఇలా జరిగేను" లాంటి కథలు సంఘంలో చిరస్థాయిగా నిలిచిపోతయి.

ఈ కథలసంపుటి, సామాన్య పాఠకుల సంగతి అటుంచి, కథకులం అనుకొంటూ తిరిగే రచయితలు మాత్రం తప్పకుండా చదువుకోవాలి. మనకు ఎలాంటి కథలు కావాలో యిప్పటికైనా మన రచయితలు గోపీచంద్ గారినించి నేర్చుకోవాలి.

గోపీచంద్, సూతాశ్రమం, తెనాలి.

